అట్టలోపలివైపున అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారతదేశంలో లేఖనకళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది

నాగార్జునకొండ క్రీ.శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీవారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# కనుపర్తి వరలక్ష్మమ్మ

పోలాప్రగడ రాజ్యలక్ష్మి



సాహిత్య అకాడెమీ

*Kanuparti Varalakshmamma :* A monograph in Telugu by Polapragada Rajyalakshmi, Sahitya Akademi, 2000, Rs. 25/-



First Published : 2000

ISBN : 81-260-0983-7

సాహిత్య అకాడెమీ

రవీంద్ర భవన్, 35, ఫెరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - 110 001

విక్రయ విభాగము :

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001

జీవన్‌తార భవనము, 4వ అంతస్తు, 23A/44X

డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700 053

172, ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,

దాదర్, ముంబాయి - 400 014

సి.ఐ.టి. క్యాంపస్, టి.టి.టి.ఐ. పోస్టు

తరమణి, చెన్నై - 600 113.

సెంట్రల్ కాలేజీ క్యాంపస్,

డా. బి.ఆర్. అంబేడ్కర్ వీధి, బెంగళూరు - 560 001

వెల : రూ. 25

Laser Typesetting by Team Work, Bangalore.
Printed at Elegant Printing Works, Bangalore.

# ముందుమాట

సాహిత్యం ద్వారా, ముఖ్యంగా వచన సాహితీరూపాలైన లేఖలూ, కధలూ ద్వారా, స్తబ్దంగా ఉన్న ఆంధ్రనారీలోకాన్ని ఉత్తేజితం చేసి, మహిళాభ్యుదయానికి ముఖ్య కారకురాలైన విదుషీమణి, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ ఆమె కళాశాలల్లో ఉన్నత విద్యనభ్యసించలేదు కాని, లోకమనే కళాశాలలో, ఉత్తీర్ణురాలైంది స్వయం కృషితో విద్యనీ అపారమైన విజ్ఞానాన్నీ పెంపొందించుకొంది.

ఆడవారు చెప్పులు తొడుక్కుని వీధిలోకి వస్తేనే విడ్డూరంగా కనిపించే రోజుల్లో, తన జన్మస్థలమైన బాపట్లలో స్త్రీహితైషిణీమండలి, యువతీ విద్యాలయము, హనుమంతరాయ బాల విద్యావిహార్‌వంటి సంస్థలు స్థాపించి, నిర్వహించి, కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించి కొంతవరకూ సాగించిన, మహిళాభ్యుదయ కార్యక్రమాల్ని తాను చేపట్టి, తెలుగు వనితల జీవితాల్లో వెలుగులు నింపిన మహిళా బాంధవి ఆమె. సరోజినీ నాయుడు, దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి, రాజకీయ, సామాజిక సేవా మూర్తులైన స్త్రీమూర్తులతో ఆమె నెరపిన స్నేహం అనుపమానం

గాంధీగారి ఆదేశానుసారం ఖద్దరు ధరించి, రాట్నలక్ష్మిని పూజించి, తన రచనలద్వారానూ ఉపన్యాసాల ద్వారానూ ప్రజల్ని ఉత్సాహపూరితులను చేసి, విదేశ వస్తు బహిష్కరణ, సహాయ నిరాకరణవంటి స్వాతంత్ర్యోద్యమ కార్యక్రమాలకి పురిగొల్పిన దేశభక్తురాలు.

మాటలోనూ రచనలోనూ కటుత్వం లేని పటుత్వం, జీవితంలోనూ సామాజిక

సేవలోనూ గర్వంలేని గాంభీర్యం, వరలక్ష్మమ్మగారి వ్యక్తిత్వంలో కనిపించే మహోన్నత లక్షణాలు.

బాపట్లలో పుష్కరం పైగా ఆమెతో నాకు ఆత్మీయమైన పరిచయం ఉంది ఆమె నన్ను ఎప్పుడూ 'అమ్మాయీ' అంటూ ఆత్మీయంగానే పిలిచేవారు. నా మాట మీద గౌరవముంచి మాయింటికామె ఎన్నిమార్లో పేరంటానికి కూడా వచ్చారు. ఆమెకి ఆంధ్ర సాహిత్య అకాడమీవారు ఉత్తమ రచయిత్రి అవార్డు ఇచ్చినప్పుడు, నేను అధ్యక్షురాలిగా ఉన్న శారదా మహిళామండలి తరపున ఆమెని సన్మానిస్తానని ఆహ్వానిస్తే చిరునవ్వుతో అంగీకరించి వచ్చారు. అప్పటికి నేను మరోమండలికి అధ్యక్షురాలిగా ఉన్నానుకనుక కాని, లేనిచో ఆమె కోరుకున్న ప్రకారం స్త్రీహితైషిణీ మండలి బాధ్యతల్ని స్వీకరించి ఉండేదాన్ని. ఆమె, నేనూ పాల్గొన్న ఓ కవి సమ్మేళణంలో, నా కవితని మెచ్చుకుంటూ, నన్ను ఆశీర్వదిస్తూ ఏకంగా, ఆమె మెళ్ళో హారాన్ని నా మెళ్ళో వేసి, తన శాలువా నాకు కప్పి, ఆనందించారు. ఆమె వాత్సల్యం అటువంటిది. చిన్నప్పుడే తల్లిని గోల్పోయిన నాకు ఆమె ఎప్పుడూ మాతృ మూర్తిగానే కనిపించేవారు.

ఆమె ప్రప్రథమ గృహలక్ష్మి స్వర్ణ కంకణ గ్రహీత.

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి నుండి ఉత్తమ రచయిత్రి అవార్డును అందుకొన్న ప్రథమాంధ్ర రచయిత్రి

ప్రపంచ తెలుగు మహాసభల్లో తామ్రఫలక పురస్కారం లభించిన విశిష్ట రచయిత్రి

ఎన్నో అవార్డులూ, మరెన్నో సన్మానాలూ, ఆ ప్రథమశ్రేణి సాహితీ మూర్తిని వరించి వచ్చాయి.

అంతటి ఉన్నత సాహితీ సరస్వతి తానై ఉండీ, నావంటి ఏ రచయిత్రికైనా, ఏ పురస్కారం లభించినా అమితంగా ఆనందించేవారు. నేను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ స్త్రీల విభాగానికి ఎన్నికైనప్పుడు ప్రత్యేకంగా వచ్చి నన్ను అభినందించారు అసూయ, అహంకారాలు ఎరుగని అమృతమూర్తి.

రచయిత్రిగా వరలక్ష్మమ్మగారు ఎంతటి ఉన్నతురాలో వ్యక్తిగా కూడా అంతటి ఉన్నతురాలే!

అలాంటి సాహితీమూర్తిని, ఆత్మీయురాలైన ఆ ఆదర్శ సాహితీ సామాజిక సేవా పరాయణురాలిని. ఈ సంగ్రహ జీవిత చరిత్రద్వారా, పాఠకులకి అందించే అవకాశం కేంద్ర సాహిత్య అకాడమీ వారు నాకు కల్పించడం, ఒక అపూర్వమైన వరంగా భావిస్తున్నాను. అందుకు అకాడమీ వారికి కృతజ్ఞతల

పోలాప్రగడ రాజ్యలక్ష్మి

# విషయ సూచిక

# ప్రస్తావన

''ధర్మము నా జీవము
నీతి నా మతము
సతీశ్రేయము నా లక్ష్యము''

- అని ప్రకటించి, ఈ మూడింటిని సమర్థించుటకే , కలము పట్టిన విదుషీమణి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ. ఆంధ్ర తీర ప్రాంతమైన గుంటూరు జిల్లాలోని బాపట్ల పట్టణంలో 6-10-1896న ఆమె జన్మించిన సమయం, ఒక్క ఆంధ్రప్రాంతమే కాదు, యావద్భారతమూ, నూత్న చైతన్యంతో నవీనమైన భావాలతో, ఒక క్రొత్త యుగానికి సమాయత్తం కాబోతూన్న సమయం.

**రాజకీయ స్థితి :** అప్పటికి రెండు వందల సంవత్సరాలనుంచి ఆంగ్లేయుల కారణంగానూ, అంతకు ముందు ఏడెనిమిది వందల ఏళ్ళనుంచి తురుష్కుల కారణంగానూ, స్వాతంత్ర్యాన్ని కోల్పోయి, బానిసత్వంతో మ్రగ్గుతూన్న భారతజాతి, దైన్య స్థితినుంచి మేలుకొని, 1857లో వీరోచితంగా ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామాన్ని సాగించింది కాని ఆ చైతన్యాన్ని సైనికుల తిరుగుబాటు అంటూ తక్కువగా అంచనా వేసి, ఆంగ్లప్రభుత్వం అధికారాన్ని తిరిగి హస్తగతం చేసుకొని భారత దేశాన్ని పాలించడం మొదలు పెట్టింది.

అయితే, 1857లో ప్రజా హృదయాల్లో తల ఎత్తిన స్వాతంత్ర్య ఆకాంక్ష జ్వాల ఆరిపోలేదు. అది స్వాతంత్ర్య ఉద్యమంగా మారి, ఒక సంస్థ స్థాపనకి కారణం అయింది.

అది అఖిల భారత కాంగ్రెసు సంస్థ దాని లక్ష్యం, దేశాన్ని రాజకీయ దాస్యం నుంచి విముక్తం చేసి, ఎన్నో వేల ఏళ్ళనుంచి ఈ దేశంలో పరిఢవిల్లిన సాంస్కృతిక జీవనాన్ని పునరుద్ధరించడం.

ఈ లక్ష్యసాధన కోసం కొందరు శాంతియుతమైన ప్రచార మార్గాన్ని ఎన్నుకుంటే, మరి కొందరు హింసాసహితమైన, విప్లవ మార్గాన్ని ఎన్నుకొన్నారు. కొందరు సభలూ, సమావేశాలూ, ఉద్యమాలూ, నిర్వహించి, ప్రజల్ని సుసంఘటితం చేసి, వారిలో స్వాతంత్ర్యకాంక్షని ప్రజ్వలితం చేసారు. మరికొందరు ఆంగ్లేయుల పై బాంబులు విసిరి అలజడి కలిగించారు. మార్గాలు వేరైనా వారందరి లక్ష్యాలూ ఒకటే. దేశాన్ని విదేశీయ పాలననుంచి విముక్తం చెయ్యడం.

పంజాబులో లాలాలజపతిరాయ్, మహారాష్ట్రలో బాలగంగాధర తిలక్, మధ్య భారతంలో మదన్ మోహన్ మాలవ్యా, మోతిలాల్ నెహ్రూ, బెంగాల్ ప్రాంతంలో అరవింద ఘోష్, చిత్తరంజన్ దాస్, దక్షిణ భారతంలో కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య వంటి అతిరథమహారథులు స్వాతంత్ర్య పోరాటం సాగించి సాగించి తదుపరి నాయకత్వం వహించే బాధ్యతను, దక్షిణాఫ్రికా స్వాతంత్ర్య వీరునిగా పేరుగాంచిన శ్రీ మోహన్‌దాస్ కరంచంద్ గాంధీకి అప్పగించారు.

విదేశీ వస్తు బహిష్కరణ, ఖద్దరు ప్రచారము, పన్నుల నిరాకరణ, ఉప్పు సత్యాగ్రహము, హరిజనోద్ధరణ, వంటి ఉద్యమాలతో ప్రజలలో చైతన్య స్ఫూర్తిని కలిగించి, స్వాతంత్ర్య సందేశాన్ని, గాంధీ, దేశంలోని పల్లెపల్లెకీ వాడవాడకీ వ్యాపింపజేశారు.

ఫలితంగా ప్రతిగ్రామమూ, ప్రతి పట్టణమూ, స్వాతంత్ర్య మంత్రోచ్చాటనతో మారుమ్రోగే యజ్ఞవాటికగా మారింది. ఎక్కడ చూసినా స్వాతంత్ర్య సమరోత్సాహమే! ఎవరినోటవిన్నా స్వరాజ్య గీతాలాపనే! ఏ ఇంట గమనించినా రాట్నం మీద నూలు వడుకుతూన్న దృశ్యమే! ఏ వ్యక్తిని పరికించినా విదేశీ వస్త్రాలను కాదని ఖద్దరు బట్టలు కట్టుకోవాలనే తహ తహ! దాంతో, వాడవాడలో రాట్న సంగీతమే! ఉత్తేజంతో సాగే ఉపన్యాస సంరంభమే! సత్యాగ్రహం సాగించి చెరసాలకు వెళ్ళాలనే సముత్సాహమే!

అలా జాతి యావత్తూ స్వాతంత్ర్య సమరోత్సాహంతో ఉద్రూతలూగుతూన్న రోజులవి.

**సాంఘిక పరిస్థితి :** ఒక నాడు యావత్ప్రపంచానికీ ఆదర్శ ప్రాయంగానూ, సర్వోత్కృష్టంగానూ ఉంటూ వచ్చిన భారతీయ సామాజిక పరిస్థితి, రానురాను అర్థంలేని ఆచారాలు ప్రబలి, మూఢవిశ్వాసాలు పెరిగి, ఛాందస వాదం ముదిరి, దయనీయమైన స్థితికి దిగజారింది.

ప్రజల్లో నైతిక వర్తన, ధర్మనిరతి నశించాయి. స్వార్థం పెరిగింది కులవ్యవస్థ వెర్రితలలు వేసింది వ్యవసాయానికీ చేతివృత్తులకీ నిరాదరణ, ఉద్యోగం పట్ల ఆకర్షణ, ఉద్యోగుల్లో లంచగొండి ప్రవృత్తి, మోసం, దగా, డాంబిక జీవనం, ఇవన్నీ నిత్యవ్యవహారాలయి పోయాయి విలాస జీవనం మరిగి జనం, పల్లెలు వదిలి పట్నాలకి ఎగబడసాగారు.

ప్రజల్లో వ్యసనాలు పెరిగాయి. వేశ్యాగమనం, హోదాకి చిహ్నంగాతయారయింది ఓ పక్క కన్యాశుల్క దుశ్చర్యం. మరోపక్క వరకట్న దురాచారం. వివాహం అనేది పవిత్రబంధం అనే అలోచన పోయి, ఒక వ్యాపారంగా మారి, స్త్రీలపట్ల అది నరకంగా తయారయింది.

పురుషునికి ఒక ధర్మం, స్త్రీకి మరొక ధర్మం. భర్తకి ఒకన్యాయం, భార్యకి ఇంకొకటి.

భార్య చనిపోతే, కాటికికాళ్ళు జాపిన ముగవాడు పెళ్లి చేసుకోవచ్చు అదే భర్త చనిపోతే బాల్యంలోనే పెళ్ళి అయిన, ముక్కు పచ్చలారని చిన్నపిల్ల, మరోపురుషుడి గురించి ఆలోచించకూడదు. జీవితాంతం వితంతువుగానే పడి ఉండాలి. ఇలా ఎన్నో ఛాందస భావాలూ, మూఢాచారాలూను.

తమ చేష్టల్ని మర్థించుకోవడం కోసం, వేదాలకీ శాస్త్రాలకీ వక్రభాష్యాలు చెప్పడం

కాదన్నవారిని 'వెలి' పేరుతో భయ పెట్టడం. ఉన్నత విద్యలకోసం అయినా సరే, విదేశీయాత్రలు చేసి వస్తే, ప్రాయశ్చిత్తం చేసుకోవాలనడం సంతర్పణలు చేసి, సంభావనలు ముట్టచెబితే ఆ దోషం పోయింది అనడం

శాస్త్ర విజ్ఞానం కొరపడి, కలరా మహమ్మారి వంటి వ్యాధులకు కూడా, దేవతల ఆగ్రహమే కారణమని నమ్మడం, వైద్యం చేయించుకోక, అమ్మవార్లకి జాతర్లు చేయించి, నైవేద్యాలు పెట్టడం.

ఆ మూఢ నమ్మకాలకి తోడు, శకునాలు, దుష్టగ్రహశాంతులు వంటి, సవాలక్ష మూఢాచారాలు.

సమాజం యావత్తూ, శాస్త్రవిజ్ఞానం లేక అర్ధ రహితమైన ఆచారాల్లో మునిగి, అభ్యుదయం, సౌఖ్యవంతమైన జీవన పథం లేక, అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతూన్న రోజులవి.

ఆ సమయంలో ఉత్తర భారతంలో, శ్రీ రాజారామ మోహన్‌రాయ్, మైకేల్‌దత్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి మేధావులూ, దక్షిణ హిందూ దేశంలో, శ్రీ కందుకూరి

వీరేశలింగంపంతులు, శ్రీ రఘుపతి వెంకటరత్నం వంటి దీక్షాదక్షులూ, తమ ఉపన్యాసముల ద్వారా ప్రజల్లో చైతన్య దీపం వెలిగించి సంఘాన్ని విజ్ఞాన మార్గం వైపు మళ్ళించ సాగారు

పరాశర సంహితలోని

**న ష్టేమృతే ప్రవ్రజితే క్లీబే చ పతితౌ పతౌ**
**పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే**

అనే శ్లోకాన్నీ కొన్ని స్మృతుల్లోని ఇతర దృష్టాంతాల్నీ చూపించి, విధవా వివాహం శాస్త్ర సమ్మతమే అని నిరూపించారు అలాగే భౌతిక శాస్త్రాల్లోని కొన్ని నిరూపిత సత్యాల్ని తెలియపరచి శకునాల్నీ, మూఢనమ్మకాల్నీ, అసంబద్ధాలని తెలియబరిచారు ఛాందస వాదులు అడుగడుగునా అడ్డుతగులుతున్నా, ఉదారులైన కొందరు ఆంగ్లేయ పాలకుల సహాయంతో సమాజానికి శ్రేయస్సు కూర్చే సతీసహగమన నిషేధం, శారదా చట్టం వంటి కొన్ని శాసనాల్ని తీసుకు వచ్చారు.

ఇటువంటి సంఘపునర్నిర్మాణానికి ఆంధ్రప్రాంతంలో నడుంకట్టిన మహనీయుల్లో శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు ముఖ్యులు అయినే ఆద్యుడు కూడా. ఆయన నిర్విరామంగా సాగించిన కృషి ఫలితంగా, తెలుగు కుటుంబాల్లో బాల్యవివాహాలు తగ్గుముఖం పట్టాయి. బహుభార్యాత్వం, వేశ్యాలోలత్వం, కన్యాశుల్కం గర్హణీయాలని ప్రజలు గుర్తించసాగారు. కుటుంబ జీవనంలో భార్యాభర్తలిద్దరూ సమానమే అనే భావన బలపడసాగింది. స్త్రీ విద్య ఆవశ్యకతని పలువురు బలపరచసాగారు. కుటుంబ జీవనంలోనూ, సామాజిక జీవనంలోనూ, వనితల ప్రాధాన్యం వృద్ధికాజొచ్చింది. స్త్రీల న్యాయమైన హక్కుల్ని గౌరవించే స్థితికి సంఘం నెమ్మదిగా చేరుకోసాగింది. అయితే ఆడవారి జీవితంలో అడ్డంకులు పూర్తిగా తొలగిపోలేదు

సమాజంలో స్త్రీ చైతన్యానికి వేకువ కనిపించింది అంతే! ఇంకా వెలుగు రాలేదు. సూర్యోదయం కాలేదు

**సాహిత్య చైతన్యం :** పురాణ ప్రబంధయుగాల తర్వాత, తెలుగులో కొన్నాళ్ళు రాజ్యం ఏలిన, చిత్ర కవిత్వ బంధకవిత్వ ధోరణులు వెనక బట్టి, ప్రజల్లో గద్యానికి గౌరవం పెరగసాగింది. గద్య తిక్కన అని పేరుగాంచిన శ్రీ వీరేశలింగంపంతులు అందుకు కొంత కారణం పద్యంతో బాటు గ్రాంధిక భాషకి కూడా రోజులు చెల్లాయి. గిడుగు రామ్మూర్తిపంతులు గారి ధర్మమా అని గ్రాంధిక భాష స్థానంలో శిష్ట వ్యావహారిక భాష నిలద్రొక్కుకో సాగింది అది గురజాడ వంటి నాటక కర్తల కృషివల్లా, పానుగంటి లక్ష్మీనరసింహంవంటి నాటక, వ్యాసకర్తల పట్టుదల కారణంగానూ, చిలకమర్తి

లక్ష్మీనరసింహం, కేతవరపు వెంకటశాస్త్రి వంటి నవలా రచయితల పట్టుదల ఫలితంగానూ ఆంధ్రసాహిత్యంలో, జటిలమైన గ్రాంధిక భాష వెనకడుగు వేసింది. దాని స్థానాన్ని సరళ వ్యావహారికం ఆక్రమించ సాగింది.

అంతేకాకుండా, నవల, కథ, వ్యాసము, లేఖవంటి సాహిత్య ప్రక్రియలు జనాన్ని ఆకర్షించసాగాయి. దానికి తోడు, రచయితలు తాము ఏసాహిత్యప్రక్రియని చేపట్టినా, అందలి కథావస్తువుని మాత్రం, వీలైనంతవరకు సమకాలీన సామాజిక జీవితం నుంచే ఎన్నుకోవడం ప్రారంభించారు. కల్పనని జోడించినా, సహజత్వం కోల్పోకుండా జాగ్రత్తపడేవారు.

అలా ఎన్నుకొనే ఇతివృత్తం కూడా, ఏదో కాలక్షేపార్థం కాకుండా, ప్రజల్లో అప్పుడప్పుడే వెల్లివిరుస్తూన్న, దేశభక్తి, సంఘసమస్య, సామాజిక చైతన్యం, సాంఘిక పునర్నిర్మాణం వంటి లక్ష్యాల్నే మనస్సులో పెట్టుకొని అందుకు దోహదం చేసే ఇతివృత్తాన్నే తీసుకొనేవారు.

వీరేశలింగంగారి రాజశేఖరచరిత్ర
గురజాడవారి కన్యాశుల్కం
పానుగంటి వారి కంఠాభరణం
కేతవరపువారి రాజ్యలక్ష్మి

వంటి ఎన్నో గ్రంథాలు ఇందుకు ఉదాహరణాలు.

సామాజిక, రాజకీయ జీవితాల్లో గణనీయమైన మార్పులు తీసుకువచ్చి, ప్రజాజీవనాన్ని మరింత మాధుర్యంగా మార్చాలని, రచయితలు ఉత్తేజంతో ఉరకలు వేస్తూన్న రోజులవి. సాహిత్యాన్ని సామాజిక ప్రయోజనంకోసం ఉపలక్షించిన సమయం అది.

అదే సమయంలో పురుషులతో బాటు కొందరు స్త్రీలు కూడా సాహిత్యరంగ ప్రవేశం చేసి, సారస్వత సేవ చెయ్యడానికి పూనుకొన్నారు. అట్టివారిలో,

చావలి బంగారమ్మ
స్థానాపతి రుక్మిణమ్మ
పాణకా కనకమ్మ
కాంచనపల్లి కనకాంబ
గుడిపూడి ఇందుమతీదేవి
ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ
చిలకలపాటి సీతాంబ
మాగంటి అన్నపూర్ణ

యామినీ పూర్ణతిలకం

బసవరాజు రాజ్యలక్ష్మమ్మ వంటి ప్రసిద్ధులెందరో ఉన్నారు. ఇలా ఎంతమందిలోనో వెల్లి విరుస్తూన్న సాహిత్య చైతన్యాన్ని ప్రోత్సాహించి, ప్రోద్బలం చెయ్యడానికి, పరిమితమైన సంఖ్యలోనే పత్రికలుండేవి. వాటిలో

ఆంధ్రపత్రిక

భారతి

గృహలక్ష్మి

అనసూయ

వినోదిని

ఆనందవాణి

మొదలైనవి ముఖ్యమైనవి

తన అభిప్రాయములనూ సంఘ సంస్కరణ భావములనూ, ప్రచారం చేయడానికి, కందుకూరివారు ప్రారంభించిన వివేకవర్ధని వంటి రెండు మూడు పత్రికలు, ఆయన జీవిత కాలంలో విశేషమైన సాహిత్య సేవనీ, సంస్కరణ ప్రచారాన్నీ సాగించి, అయన మరణంతో అవీ నిలిచిపోయాయి. అయితే తమ ప్రభావాన్ని మాత్రం, ఆంధ్రపత్రిక వంటి పత్రికల మీద అమితంగా ప్రసరింపజేశాయి

గాంధీగారి నాయకత్వంలో స్వాతంత్ర్యోద్యమం, వెల్లి విరిసిన ఉత్సాహంతో సాగుతోంది.

వీరేశలింగంగారు సాగించిన సారస్వత సామాజిక సంస్కరణలు, వివేకవంతులైన ప్రజల్లో గాఢంగా నాటుకొని, వారినీ వారితో బాటు యావత్ సమాజాన్నీ చైతన్యలోకంవైపు సాహసించి అడుగువెయ్యడానికి సమాయత్తం చేస్తున్నాయి.

సారస్వత లోకంలో, కథ, నవల, వ్యాసం, నాటకం వంటి ప్రక్రియలు, బాగా వేళ్ళు పాతుకొని, ప్రజాహృదయాల్ని ఆకట్టుకోసాగాయి.

తనకి సమాజంలో యుగయుగాలుగా జరుగుతూన్న అన్యాయాన్ని ఎదిరిస్తూ, తనకి న్యాయం జరగాలని, వనిత, ధైర్యంగా గళం నిప్పి అడుగుతోంది. కలం పట్టి ప్రశ్నిస్తోంది.

ఇలా వినూత్న చైతన్యంతో జనజీవనం పరిఢవిల్లుతూన్న సమయంలో, పందొమ్మిదవ శతాబ్దం చివరి రోజుల్లో, అనగా 1896లో అక్టోబరు 6వ తేదీన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు, బాపట్లలో, పాలపర్తి శేషయ్య హనుమాయమ్మ దంపతులకు జన్మించారు. ఆ దంపతులకు వరలక్ష్మమ్మతో బాటు అయిదుగురు కుమారులు. రామమూర్తి, నరసింహం, భావనారాయణ, ఆంజనేయులు, కృష్ణమూర్తి.

మరి ఇద్దరు కుమార్తెలు సుబ్బలక్ష్మమ్మ, అనసూయ

ఇలా అయిదుగురు సోదరుల మధ్యా, ఇద్దరు సోదరీమణుల మధ్యా ''వరాలూ!' అంటూ, అంతా ఆప్యాయంగా పిలుచుకొనే పెద్ద కుటుంబంలో, ముద్దుగా పెరిగిన అదృష్టవంతురాలు కనుపర్తి వరలక్ష్మమ్మ.

# జీవిత సంగ్రామం

**బాపట్ల :**

వరలక్ష్మమ్మ పుట్టిన ఊరు బాపట్ల. పెద్ద పట్టణము కాదు, అలాగని పల్లేకాదు. తాలూకా ముఖ్యకేంద్రం. ఆంధ్రప్రదేశ్‌లో సర్కారు జిల్లాలుగా పిలిచే తీర ప్రాంతంలో, బంగాళాఖాతం ఒడ్డున, సముద్రానికి మూడు మైళ్ళ దూరంలో, ఎప్పుడో చాళుక్య వంశరాజుల కాలంలో భావనారాయణస్వామి ఆలయం నిర్మాణం జరిగి, ఆ ఆలయం చుట్టూ భావపురి అనే పేరుతో వెలసిన చిన్నపట్టణం అది. చెన్నైనుంచి కలకత్తాకి వెళ్ళే రైలు మార్గంలో, నేత పరిశ్రమకి పేరుగాంచిన చీరాలకీ, ప్రసిద్ధ రాజకీయవేత్త ఎస్.జి.రంగా స్వస్థలమైన నిడుబ్రోలుకీ, మధ్య అటూ ఇటూ దాదాపు సమాన దూరంలో ఉంది. రామదండు పేరుతో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య డెబ్బయి ఏళ్ళక్రితం సాగించిన చీరాల-పేరాల ఉద్యమం, భారత జాతికంతకీ తెలిసిందే-ఆ చీరాలకు పదిమైళ్ళు ఉత్తరాన బాపట్ల ఉంది

బాపట్ల కూడా రాజకీయ చైతన్యం సమృద్ధిగా ఉన్న పట్టణమే! ప్రత్యేకాంధ్ర రాష్ట్రనిర్మాణానికి ప్రయత్నం ప్రారంభమైంది బాపట్లలోనే. 1913లో అక్కడ జరిగిన ప్రథమాంధ్ర మహాసభల్లో, ఆంధ్రులకి ఒక రాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పాటు కావాలని మొదటిసారిగా తీర్మానం చెయ్యడం జరిగింది.

రాజకీయాలకే కాదు, బాపట్ల కళలకి కూడా కాణాచియే.

పద్మశ్రీ స్థానం నరసింహరావు, ఈలపాట రఘురామయ్య, ప్రముఖనామములీన విద్వాంసులు నోరి నాగభూషణం, ఇల్లిందల సరస్వతీ దేవి, యల్లాప్రగడ సీతాకుమారిగార్లది ఆ ఊరే. రంగమార్తాండ సింగరాజు నాగభూషణరావు, రంగ రచనా ప్రవీణ కొర్రపాటి గంగాధరరావు, మొదట చలనచిత్ర నటుడూ తర్వాత రాజకీయ నాయకుడూ అయిన శ్రీ కోన ప్రభాకరరావు గార్ల ఊరు బాపట్లే! వరలక్ష్మమ్మగారి తర్వాత తరం వారైన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, మల్లాది సుబ్బమ్మ, దేశిరాజు భారతీదేవి, పోలాప్రగడ రాజ్యలక్ష్మి, సత్యనారాయణ మూర్తి ఆ పట్టణవాసులే-విజిల్ విజార్డ్‌గా ప్రసిద్ధినొందిన ప్రసాద్, చిత్రసీమలో పేరుగాంచిన పి.ఎల్. నారాయణ, కె.యస్.టి. శాయిల జన్మస్థలం కూడా బాపట్లే.

ఇలా సర్వకళా విలసితము, సంస్కార సంశోభితము అయిన బాపట్లలోని హైస్కూల్లో విద్యాభ్యాసం చేసి విశ్వవిఖ్యాతులైన మహానుభావులెందరో ఉన్నారు. వారిలో ప్రసిద్ధ సంపాదకులు శ్రీ కోటంరాజు పున్నయ్య, కోటంరాజు రామారావు, హైకోర్టు న్యాయమూర్తులు కందా భీమశంకరం, చింతగుంట రాఘవరావులు ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ప్రసిద్ధ సాహితీ వేత్తలు శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీతల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి వంటి ప్రఖ్యాతులైన వ్యక్తులెందరో ఉన్నారు.

**బాల్యం :**

ప్రాచీన సంస్కృతి, అధునాతన నాగరికతా, రెండూ పడుగూ పేకగా అల్లుకొని ఉన్న బాపట్లలో, సంప్రదాయబద్ధమైన ఆర్వేల నియోగి కుటుంబంలో అల్లారు ముద్దుగా పెరిగిన బాలిక, కనుపర్తి వరలక్ష్మమ్మ. కాని ఆ రోజుల్లో ఉన్న పరిస్థితుల్నిబట్టి, ఆడపిల్లలకి చదువు అవసరం లేదు.గృహకృత్యములు నిర్వర్తించుకుంటూ ఇంటిని చక్కదిద్దుకుంటూ భర్తకి అనుకూలంగా నడచుకుంటూ జీవితాన్ని సాగిస్తే చాలు-అదే ఆమె ధ్యేయమూ, లక్ష్యమూను. ఆడవారు వీధుల్లో చెప్పులు వేసుకుని నడవడం మర్యాదకాదు. అవసరం వచ్చినా కళ్ళజోడు ధరించడం అధిక్షేపణీయం-ఇలా ఏవో కొన్ని అసంబద్ధమైన అభిప్రాయాలు సంఘంలో ఉండేవి

అయితే, వరలక్ష్మమ్మ ఒక, విలక్షణమైన బిడ్డ కదా-కనిపించిన ప్రతి పత్రికా, ప్రతి పుస్తకం ఆసక్తితో చదివేవారు. వాటిలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి నవలలూ, వీరేశలింగంపంతులుగారు వ్రాసిన పుస్తకములూ, విజ్ఞాన చంద్రికా మండలివారి గ్రంథములూ ముఖ్యమైనవి. ఆ రోజుల్లో వచ్చే 'సావిత్రి' అనే మాస పత్రికని ఆమె తప్పకుండా చదివేవారు. అన్నగారి ప్రోత్సాహముతో వీరేశలింగంగారి వ్యాసాల్ని చదివి, వాటి సారాంశాన్నీ, అందలి భావాల్నీ, ఆమె తన స్వంతమాటలతో వ్రాసేవారు. ఈ సంగతిని ఆమె తరువాత పెద్దయ్యాక

"ఆ రోజుల్లో పత్రికలన్నీ శుద్ధమైన భాషలో విజ్ఞానదాయకమైన విషయములతో చక్కగా ఉండేవి వానిని మేము చదువుతూ ఉండే వాళ్ళము" అంటూ ప్రస్తావించారు. ఒకమారు కొటికలపూడి సీతమ్మ గారనే విదుషీమణి బాపట్ల వచ్చి, "స్త్రీలు విద్యని అభ్యసించాలి" అంటూ ఉపన్యసించారు. తల్లిగారితో ఆ ఉపన్యాసాన్ని వినడానికి వెళ్ళిన, చిన్నపిల్ల వరలక్ష్మమ్మగారి హృదయంలో 'నేను విద్యాభ్యాసం చెయ్యాలి" అనే దృఢ సంకల్పం కల్గింది. విద్యాభ్యాసం అనగా స్కూళ్ళకీ కాలేజీలకే వెళ్ళనక్కర్లేదు. మంచి గ్రంథాల్ని చదివి బాగా అవగాహనచేసికొని అర్థాన్ని మనస్సుకి పట్టించుకుంటే, అదీ విద్యాభ్యాసమే అవుతుంది. ఆ విధంగా కూడా విద్యావంతురాలు కావచ్చు. వరలక్ష్మమ్మగారి విషయంలో అదే జరిగింది.

బాపట్లలో చోరగుడి సీతమ్మగారని ఒక విదుషీమణి ఉండేవారు. ఆమె త్రిపుర సుందరీ సమాజం, యువతీ విద్యాలయం నిర్వహిస్తూ మహిళాభ్యుదయానికి ఎంతో కృషి చేశారు. ఆమె సహచర్యంలో, బాలికగా ఉన్న వరలక్ష్మమ్మగారు, ఎంతో నేర్చుకున్నారు కృష్ణాపత్రిక సంచికలు చదివి లోకాన్ని అర్థం చేసుకున్నారు. మనుచరిత్ర, రఘువంశము వంటి తెలుగు సంస్కృత గ్రంథాల్ని చదివి, శబ్దమంజరి సహాయంతో, తెలియని పదాలకి అర్థాలు తెలుసుకొని, తన సంస్కృతాంధ్ర భాషా సామర్థ్యాన్ని ద్విగుణీకృతం చేసుకున్నారు. చెల్లెలి ఉత్సాహాన్ని గమనించి అన్నగారైన నరసింహం ఆమెకి, అత్తవారింటికి వెళ్ళేటప్పుడు 'శబ్దార్థచంద్రిక' అనే తెలుగు నిఘంటువుని బహూకరించారు. అది ఆమెకి లభించిన ఒక అపురూపమైన కానుక.

**వివాహం :**

ఆ రోజుల్లో ఆడపిల్లలకి చిన్నవయస్సులోనే పెళ్ళి అయేది. కనుపర్తి వరలక్ష్మమ్మగారికి కూడా అదే జరిగింది ఆమెకి పన్నెండేళ్ళు పూర్తి అయేసరికి, అనగా 1909లో, బాపట్ల నివాసి, పండిత కుటుంబ సంజాతుడూ అయిన శ్రీ కనుపర్తి హనుమంతరావుగారితో వివాహం అయింది. ఆ విధంగా ఆమె పుట్టినిల్లూ, మెట్టినిల్లూ, రెండూ బాపట్లే!

హనుమంతరావుగారు విద్యావంతుడూ, సంస్కారి, మీదుమిక్కిలి స్త్రీ జనాభ్యుదయాన్ని ప్రోత్సాహించే వ్యక్తి. వ్యక్తిగా రచయిత్రిగా, సారస్వత మూర్తిగా, వరలక్ష్మమ్మగారు ఉన్నతంగా ఎదగడానికి అయన అందించిన ప్రోత్సాహప్రోద్బలాలు మరువలేనివి. విద్యాభ్యాసం సాగించిన రోజుల్లో, రాజమహేంద్రవరంలో, వీరేశలింగం ఉద్యమాల వల్ల అయన ఎంతో ప్రభావితులయ్యారు. అందువల్ల వనితల విద్యావిజ్ఞానాలకి ఉపకరించే ఎన్నో గ్రంథాల్ని అయన తరుచు తీసుకువచ్చి భార్యకి ఇచ్చేవారు. వరలక్ష్మమ్మ అవి చదివి రచయిత్రిగా ఎదిగారు. ఆమె ఉన్నత సాహిత్యమూర్తిగా, రూపుదిద్దుకున్నారంటే,

అయన ప్రోత్సాహం కొంతకారణం భార్యకు గల సాహిత్యాభిలాషని గుర్తించి ప్రోత్సాహించిన హనుమంతరావుగారు అభినందనీయులు. ఆమె వ్రాసిన వ్యాసాల్నీ, కథల్నీ అయన కవరుల్లో పెట్టి పోస్టు చేసేవారు. అంతటి ప్రోత్సాహం అయనది.

హనుమంతరావుగారు ఉద్యోగ రీత్యా ఆరోగ్య శాఖలో హెల్త్ ఇన్స్పెక్టర్ ఆఫీసరుగా ఎన్నో పట్టణాలకి వెళ్ళారు భర్తతో ఆయా ఊళ్ళు వెళ్ళిన వరలక్ష్మమ్మ, తాను వెళ్ళిన ప్రతి పట్టణంలోనూ, స్త్రీలని తన ఉపన్యాసములద్వారా ప్రోత్సహిస్తూ స్త్రీ జనాభ్యుదయ కార్యక్రమాలు నిర్వహిస్తూ, నిత్యమూ వనితాభ్యుదయానికి కృషిచేస్తూనే ఉండేవారు రాజమహేంద్రవరంలో ఉండగా, గౌతమీ గ్రంధాలయంలోని ఉపయుక్త గ్రంధాలన్నీ చదివారు. హనుమంతరావుగారు, బదిలీ కారణంగా, కొన్నాళ్ళు మదనపల్లెలో ఉంటే వరలక్ష్మమ్మగారు మదనపల్లెలోని మహిళా సమాజంవారి అభ్యర్థనపై వారం వారం ఏదో ఒక విషయం పై ఉపన్యసించి అక్కడి మహిళల మన్ననలు పొందారు.

## తొలి ప్రయత్నం :

1911లో తండ్రి స్వర్గస్థులయ్యాక, అన్నగారైన నరసింహంగారితో రాజమహేంద్రవరం వెళ్ళి కొన్నాళ్ళు అక్కడ ఉన్న వరలక్ష్మమ్మ, గౌతమీ గ్రంథాలయంలోని పుస్తకాలు చదివి, ఆంధ్రమహాభారత ఘట్టాలు వినీ, తన బాషా సంపదని పెంచుకొన్నారు. మదిలో మెదిలే భావాలకి ఆకారం కల్పించసాగారు.

ఆ రోజుల్లో నరసాపురం తాలూకా అభివృద్ధి సంఘం, స్త్రీలలో విద్యాభివృద్ధి కలిగించి, వారిలో విజ్ఞానతృష్ణని పెంపొందించడం కోసం, కొన్ని పరీక్షలు నిర్వహించి బహుమతులిచ్చేవారు. అన్నగారైన నరసింహంగారి ప్రోత్సాహంతో శ్రీమతి వరలక్ష్మమ్మ ఆ పరీక్షలు వ్రాసి స్వర్ణపతకాన్ని సాధించారు. తర్వాత మద్రాసులో జరిగే విజ్ఞాన చంద్రికా పరీక్షల్లో కూడా ఉత్తీర్ణులయారు. ఆ పరీక్షల్లో ఉత్తీర్ణులైనవారిలో నాటి ప్రముఖ కవయిత్రులు కాంచనపల్లి కనకాంబ, అదుర్తి భాస్కరాంబ గారలు కూడా ఉన్నారు. మరొకమారు ఆమె మచిలీపట్నం భక్త సమాజం నిర్వహించిన పరీక్షలు కూడా వ్రాసి ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. ఇలా రకరకాల పరీక్షలకి కూర్చోవడం వల్ల, వరలక్ష్మమ్మగారి భాషా సామర్థ్యం పెరిగింది. భావనైశిత్యం స్థిరపడింది. ముమ్ముందు ఎన్నో కథలూ వ్యాసాలూ వ్రాసి, మరెన్నో రచనలు చేసి, ఒక సమున్నత సాహితి మూర్తిగా ఎదగడానికి సానుకూలం అయింది. గుంటూరులో పాలపర్తి రామమూర్తిగారు స్థాపించిన, వనితా గ్రంధ మండలి బాధ్యతలు కొన్ని స్వీకరించడం వల్లా, గ్రంధ మండలికి వచ్చే క్రొత్తక్రొత్త పుస్తకాలతో బాటు రామాయణ భారత భాగవతాల్ని కూడా చదివి అర్థ

చేసుకోవడం వల్లా, వరలక్ష్మమ్మగారికి అటు వ్యవహార దక్షత అలవడింది-ఇటు భాషాజ్ఞానం పెరిగింది.

రామమూర్తిగారు ఆమె పెద్దన్నగారు కాగా, ఆంజనేయులుగారు మరో అన్నగారు అయన ఒకమారు ఒక ఆంగ్ల కథని వినిపించి, ఆ కథని తెలుగులో స్వంతముగా వ్రాయమన్నారు. వరలక్ష్మమ్మ అలాగే అని తన శక్తియుక్తులన్నీ క్రోడీకరించి వ్రాశారు. 'సౌదామిని' అనే కలం పేరుతో ఆ కథని అనసూయ అనే పత్రికకి పంపారు అది అచ్చు అయింది. వరలక్ష్మమ్మగారి మొదటి సృజనాత్మక రచన అదే! అది ఆంగ్ల కథకి అనువాదం కాదు- కథని చదివి దాని స్ఫూర్తితో తెలుగులో వరలక్ష్మమ్మ స్వంతంగా రాసిన కథ అది.

## ప్రగతి, పురోగతి :

ఆ తర్వాత, ఆమె, సుమారు నాలుగైదు దశాబ్దాల పాటు, పుంఖాను పుంఖాలుగా రచనలు చేశారు. సుమారు ఏభయి కథలు, ఒకటిరెండు నవలలు, నాటి ప్రసిద్ధ పత్రికలైన భారతి, గృహలక్ష్మి, అనసూయ, వినోదిని, ఆనందవాణి, కళ్యాణి మొదలైన వాటిలో వ్రాశారు అంతేకాక ఆమెకు అమితమైన గుర్తింపునీ ఖ్యాతినీ తీసుకువచ్చిన 'శారదలేఖలు' గృహలక్ష్మి పత్రికలో అయిదారు సంవత్సరములు వరుసగా వ్రాసారు శారద లేఖలతో బాటు ఆమెకి అమితమైన పేరు తీసుకువచ్చినవి, లీలావతిఅనే కలం పేరుతో ఆంధ్రపత్రికకి వ్రాసిన 'మా చెట్టు నీడ ముచ్చట్లు' ఇవన్నీ కాక ఆమె ఎన్నో రేడియో ప్రసంగాలు చేశారు. గాంధీ దండకము రచించారు భక్తినీ దేశభక్తినీ పాఠకుల్లో రగిలించే నిమిత్తం అసంఖ్యాకమైన పాటలూ పద్యాలూ రాశారు. చిన్న పిల్లలు ప్రదర్శించే నిమిత్తం కొన్ని నాటికలు కూడా రచించారు.

ఆమె సాహిత్యకృషికి గుర్తింపుగా 1930లో గృహలక్ష్మి స్వర్ణపతకం, 1934లో స్వర్ణకంకణం, 1953లో బాపట్ల పౌరసన్మానం, 1967లో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ఉత్తమ రచయిత్రి పురస్కారం. 1967లోనే గుడివాడ సప్తతి మహోత్సవ సన్మానసభలో 'కవితా ప్రవీణ' బిరుదు ప్రదానం, 1968లో అఖిలభారత తెలుగు రచయితల సభలో సన్మానం, 1975లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల స్వర్ణఫలక, తామ్రపత్రబహూకృతి, ఇలా ఎన్నో గౌరవాలూ సత్కారాలూ ఆమెకు లభించాయి.

వరలక్ష్మమ్మ కేవలం సాహిత్య సేవే కాదు, గణనీయమైన సామాజిక కార్యక్రమాలు కూడా నిర్వహించారు. ముఖ్యంగా స్త్రీ సంక్షేమానికి ఆమె చేసిన కృషి ప్రముఖమైనది. స్త్రీచైతన్యం కోసం ఎన్నో ఉపన్యాసాలిచ్చారు రచనలు చేశారు. 1931లో బాపట్లలో స్త్రీహితైషిణీ మండలి స్థాపించి, 1942లో ఆ మండలికి శాశ్వత భవనాన్ని సమకూర్చారు. 1929 బెజవాడ మహిళాసభలో ఉపన్యసించారు. 1933లో గుంటూరులో జరిగిన రాష్ట్రమహిళాసభకు

అధ్యక్షత వహించారు 1952లో ఆంధ్రరాష్ట్ర ఉద్యమంలో భాగంగా బాపట్లలో మహిళా ప్రదర్శన నిర్వహించారు. స్త్రీలకి విద్యని అందించాలనే సదుద్దేశంతో 1959లో యువతి సంక్షిప్త విద్యాలయాన్నీ, పిల్లలకోసం 1965లో హనుమంతరాయ బాలవిద్యావిహార్‌ను స్థాపించారు.

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ సేవలు, సాహిత్య సామాజిక రంగాలతో బాటు రాజకీయ రంగానికి కూడా విస్తరించాయి ఆమె దేశభక్తి అసమాన్యమైనది. భర్త బ్రిటిష్ ప్రభుత్వంలో అధికారిగా ఉన్నా, ఆమె బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించి పోరాడే కాంగ్రెసు ఉద్యమంలో చేరి, తన దేశభక్తిని చాటుకొన్నారు. 1921లో మహాత్మాగాంధికి ఇచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకొని, వాటినుండి జీవిత పరిసమాప్తి వరకూ స్వదేశీ వస్తువుల్నే వాడారు. ఖద్దరు వస్త్రాలే ధరించారు స్వరాజ్యలక్ష్మీవ్రతం, రాట్నలక్ష్మీ పూజ చేస్తూ తన దేశభక్తిని చాటుకున్నారు. సరోజిని నాయుడు, దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి దేశభక్తులైన మహిళా నాయుకులతో అత్యంత సన్నిహితమైన మైత్రిని సాగించారు ఓటు పురాణము వ్రాసి ప్రజల్లో ఓటు హక్కుపట్ల అవగాహన పెంచారు 1949నుండి 1952 వరకు మూడేళ్ళు గుంటూరు జిల్లా బోర్డు సభ్యులుగా కొనసాగారు.

1909లో కనుపర్తి హనుమంతరావుగారితో వివాహం అయాక, నలభైఅయిదు సంవత్సరాలు, అనగా 8-10-1954 న హనుమంతరావుగారు చనిపోయేవరకూ, వరలక్ష్మమ్మగారు, అన్ని సందర్భాలలోనూ భర్తగౌరవాదర అభిమానాల్ని పొందుతూ, సహాయ సహకారాల్ని అందుకుంటూ, సంతోషప్రదమైన వైవాహిక జీవితాన్ని గడిపారు ఆదర్శ గృహలక్ష్మిగా మనుగడ సాగించారు

విషాదకరమైన విషయం ఒక్కటే-ఆమెకి సంతానం లేదు. 1917లో ఒక కుమారుడు కలిగాడు. కాని మూడుమాసములు నిండకుండానే చనిపోయాడు. గృహస్థ జీవితంలో ఆమెకు కలిగిన దుఃఖ సంఘటన అది. పిల్లలంటే ఆమెకి అమితమైన ప్రేమ కాని పుట్టిన ఒక్క కుమారుడూ చనిపోయాడు. దానికి తోడు వరలక్ష్మమ్మగారిని కన్న కూతురుకంటే ఎక్కువగా చూసుకునే ఆమె ఆడుబిడ్డ (హనుమంతరావుగారి అక్క) మాణిక్యాంబ 1938లో చనిపోయారు దాంతో ఇంట్లో వరలక్ష్మమ్మగారు హనుమంతరావుగారు మాత్రమే మిగిలారు వరలక్ష్మమ్మగారు ఏకాంతంగా దిగులుగా ఉండడం చూసి, ఆమె మరదలు తామ్రపర్ణి వచ్చి, తన కుమార్తె భానుమతిని, రెండేళ్ల పసిప్రాయంలోనే వరలక్ష్మమ్మగారికి అప్పగించారు. భానుమతి ప్రవేశంతో వరలక్ష్మమ్మగారి దిగులు కొంత తగ్గింది. ఆ అమ్మాయిని పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు నేర్పి వివాహం జరిపించి, తనకుమార్తె గానే చూసుకున్నారు వరలక్ష్మమ్మ.

శేషజీవితాన్ని, స్త్రీహితైషిణీ మండలి అభివృద్ధికి వినియోగిస్తూ అహరహమూ కృషిచేస్తూ, రచనావ్యాసంగం క్రమక్రమంగా తగ్గిస్తూ, తను పెంచుకున్న భానుమతినీ ఆమె కుటుంబాన్నీ చూసి సంతోషిస్తూ, ఒకరకమైన విరామ జీవితాన్ని సాగించి, తుదకు బాపట్లలో తమ స్వగృహంలో తమ ఎనభైరెండవ ఏట, అనగా 13-8-1978న కన్నుమూశారు, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు.

# సారస్వతమూర్తి

**ప్రవేశం :** సౌజన్య స్వరూపులైన అన్నగార్ల ప్రోత్సాహం, విద్యాసంస్కారాలు గల భర్త అందించిన సహకారం, కొటికలపూడి సీతమ్మ, చోరగుడి సీతమ్మవంటి విదుషీమణులు ఇచ్చిన చక్కని సలహాలు, వీటి అన్నిటికి తోడు, 'నేను విద్యావతిని కావాలి. నాకు తెలిసిన మంచి విషయాల్ని రచనలద్వారా పదిమందికీ తెలియపర్చాలి.'' అనే బలమైన కోరికా, పట్టుదలా గుండెలనిండా ఉండడం, ఇలా ఎన్నో శక్తుల ఫలితంగా, శ్రీమతి కనుమర్తి వరలక్ష్మమ్మ సారస్వత మూర్తిగా ఎదిగారు.

అలా ఎదగడానికి అవసరమైన సాధన సంపత్తిని ఆమె ఇరవైఏళ్ళు నిండకముందే అపారంగా సంపాందించారు. భారత భాగవత రామాయణాది ఉద్గ్రంధాలతో బాటు, కాళిదాస రఘువంశం, పెద్దనామాత్యుని మనుచరిత్ర వంటి కావ్యాల్ని కూడా అర్థస్ఫూర్తితో పఠించి అర్థం చేసుకున్నారు సమకాలీన సామాజిక సమస్యలకి అద్దం పడతూ, ఆరోజుల్లో అశేషప్రజాదరణని చూరగొంటున్న, శ్రీ వీరేశలింగం రచనల్నీ, పానుగంటివారి నాటకాల్నీ, సాక్షివ్యాసాల్నీ, చిలకమర్తివారి నవలల్నీ అమితాసక్తితో చదివారు. అంతేకాదు అప్పుడు వస్తూన్న ఆంధ్రపత్రిక, భారతి, గృహలక్ష్మి, అనసూయ, కృష్ణాపత్రిక, వినోదిని వంటి ప్రముఖ పత్రికల్ని క్రమం తప్పకుండా చదివేవారు.

''గ్రంధ రచన చెయ్యాలి'' అనే బలమైన కోరికకి, ఆమె చదివిన పుస్తకాలూ, పత్రికాలూ దోహదం చేశాయి. నరసాపురం తాలూకా అభివృద్ధి సంఘంవారు నిర్వహించిన పరీక్షలో స్వర్ణపతకం రావడంతో ఆమెకి ఆత్మవిశ్వాసం పెరిగింది. అన్నగారి ప్రోత్సాహంతో ఒక

ఆంగ్లకథని చదివి, ఆ కథని తిరిగి తెలుగులో స్వకపోలకల్పితంగా రాసి, సౌదామిని అనే కలం పేరుతో అనసూయ అనే పత్రికకి పంపడం, ఆ కథ అచ్చుకావడం, వరలక్ష్మమ్మగారికి ఉత్సాహాన్నిచ్చింది. ప్రోత్సాహం కలిగించింది

అప్పటినుంచి ఆమె నిర్విరామంగా సమాజానికి తానొక సంగతి చెప్పాలనే ఆలోచన వచ్చినప్పుడల్లా, ఏదైనా ఒక బలీయమైన సంఘటన ఆమె మనస్సుని కదలించినప్పుడల్లా, కలం తీసుకుని, కథ రాసేవారు. లేదా వ్యాసం. ఏదో ఒక రచన. అయితే ఆమె రచనల్లో ఎక్కువ భాగం కథలూ, లేఖలూను

**కథలు :** ఆ విధంగా నాలుగు దశాబ్దాలు పైగా వరలక్ష్మమ్మగారు ఎన్నో కథలు వివిధ పత్రికలకి రాశారు. భారతి, ఆంధ్రపత్రిక, గృహలక్ష్మి, అనసూయ, వినోదిని, ఆనందవాణి, కళ్యాణి, వంటి ఆనాటి ప్రసిద్ధ పత్రికలన్నీ ఆమె కథల్ని, ఆయా సంచికల్లో ప్రచురించేవారు.

భారతి, నాటికీ నేటికీ ఏనాటికీ తెలుగు సాహిత్యానికి, అపురూపమైన సేవ చేసిన ఉత్తమశ్రేణి సాహిత్య మాసపత్రిక అందులో నాటి ఉద్దండ పండితులైన మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, వేదము వెంకటరాయ శాస్త్రి, విక్రమదేవ వర్మ, అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి, సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి, నేలటూరి వెంకటరమణయ్య, నిడదవోలు వెంకట రావు, అంద్ర శేషగిరి రావు, మల్లంపల్లి సోమశేఖర శర్మ, వేలూరి శివరామ శాస్త్రి కవివరేణ్యులైన శేషాద్రికవులు, విశ్వనాథ సత్యనారాయణ, తల్లావఝ్ఝల శివశంకర స్వామి, వడ్డాది సుబ్బారాయుడు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, కొడాలి అంజనేయులు, బసవరాజు అప్పారావు వంటి వారూ, ప్రసిద్ధ కథకులైన చింతాదీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు ప్రభృతులు ఆ రోజుల్లో తమ సాహిత్యవ్యాసాల్నీ, కవితల్నీ, కథల్నీ రాసేవారు. అలాంటి మహామహులతో బాటు 1925 నుండి రెండు దశాబ్దాల పాటు భారతిలో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఎన్నో కథలు రాశారు. వాటిలో కొన్ని -

| | | |
|---|---|---|
| ప్రేమసుధ | - | సెప్టెంబరు 1925 సంచిక |
| బేంకి బుచ్చిబాబు | - | జనవరి 1926 |
| రెండు కోర్కెలు | - | నవంబరు 1926 |
| దీర్ఘ సుమంగళీ భవ | - | ఆగష్టు 1928 |
| నేనే అపరాధిని | - | మే 1929 |
| వరద రాజేశ్వరి | - | జనవరి 1930 |
| ముందుకథ | - | జూలై 1930 |
| నాకీ శాస్తి చేశావా | - | ఏప్రిల్ 1932 |

| | | |
|---|---|---|
| దరిద్రనారాయణుడని | | |
| ఆజగద్రక్షకుడి బిరుదైతే | - | నవంబరు 1932 |
| అయితే పాపములలిత గతేమిటి | - | మే 1933 |
| ఒట్టు | - | డిశంబరు 1933 |
| మూడు తీర్మానాలు | - | ఫిబ్రవరి 1935 |

పైన పేర్కొన్నవేకాక శ్రీమతి వరలక్ష్మమ్మ భారతిలో 'ప్రేమ ప్రభావము' 'తోటమాలి గురవడు' వంటి మరికొన్ని కథలూ, భృత్యనీతి' అనే ఓ వచన నాటికా రాశారు.

భారతి తర్వాత ఆమె కథల్ని ఎక్కువగా ప్రచురించిన పత్రిక, వినోదిని. ఆ పత్రికలో ఆమె సుమారు పది పదిహేను కథలు రాశారు. వాటిలో కొన్ని

మ్రొక్కుబడి
పాపయ్యపంతులు పెళ్ళి
కనకాంబగారి కారు షికారు
తగ్గింపు
కాఫీ హోటళ్ళే గతి
ఓట్లమేళాం
ఈ అపరాధం ఎవరిది
అన్నమ్మవ్వ ఆచారం
చిట్టి
కొడుకు పెండ్లి
చుట్టపు చూపు

అనేవి కొన్ని, వినోదినితో తీసి పోకుండా గృహలక్ష్మి పత్రిక కూడా ఆమె కథల్ని ఎక్కువగా ప్రచురించింది. వాటిలో కొన్ని -

పెంచిన ప్రేమ
మీపాదముల సాక్షిగా
5 నెలల 20 దినములు
పెన్షన్ పుచ్చుకున్న నాటి రాత్రి
గురుదక్షిణ

చట్టసభలలో మెజారిటీ మీదేగా
విందుముచ్చట
శ్రావణ పట్టీ-కథలు
- అనసూయ అనే పత్రికలో
సౌదామిని
లక్కాభరిణి
కనకవల్లి
ప్రేమలత కథల్నీ,
ఆనందవాణి, కళ్యాణివంటి ఇతర పత్రికల్లో
ఈ పాపమంతా నాది
కుటీరలక్ష్మి
మధు
ఉయ్యాలపండుగ
ప్రణయలేఖలు
కన్యాశ్రమము
ప్రేమ ఒకచోట పెండ్లి ఒకచోట
చదివింపు

ముగ్గురి మనసులు - అనే శీర్షికలతో ఎన్నో కథలూ రాశారు. కనుపర్తివారి కథలన్నీ, ప్రాచుర్యం పొందినవే-వాటిలో ముఖ్యంగా, పెన్షన్ పుచ్చుకున్న రాత్రి, మావూరు, దీర్ఘ సుమంగళీ భవ, దరిద్రనారాయణుడని ఆ జగద్రక్షకుడి బిరుదైతే వంటి కొన్ని కథలు పాఠకుల మనస్సులలో మరీ చెరగని ముద్ర వేశాయి.

శ్రీమతి వరలక్ష్మమ్మ ఆంధ్ర సాహిత్య చరిత్రలో సముచిత స్థానాన్ని సముపార్జించి పెట్టినవి. ఆమె కథలూ, లేఖాసాహిత్యం, వ్యాసావళీను. తెలుగు కథని సుసంపన్నం చేసిన విదుషీమణుల్లో ఆమెది అగ్రశ్రేణి. ఆమెకి ఆ స్థానం లభించడానికి కారణాలు అనేకం. ఇతివృత్తస్వీకరణ, కథానిర్వహణ, శైలి విన్యాసం, లక్ష్యశుద్ధి, జీవిత సూక్తం వాటిలో ముఖ్యమైనవి.

**కథావస్తువు :** వరలక్ష్మమ్మగారు సుమారు ఏభయి పైగా కథలు రాశారు. ఏ కథా, తన చుట్టూ ఉన్న సమాజానికి దూరంగా, ఊహాలోకంలో విహరిస్తూ అసంబద్ధంగా ఉండదు. సమాజంలో ఆమె చూసిన, చూస్తూన్న, సంగతుల్నే, ఇతివృత్తాలుగా తీసుకుని, తన భావాల్నీ

లక్ష్యాల్నీ జోడించి, వాటిని కళాత్మకంగా తీర్చిదిద్ది, సమాజం ఎలా ఉందో, ఎలా ఉండాలో చెబుతూ, సందేశాన్ని అందిస్తున్నా, అందిస్తున్నట్లు కనిపించకుండా, ఎంతో వాస్తవికంగా ఉండేలా, రాశారు. కథల్లో వస్తువైవిధ్యం ఎంతో ఉంది.

బ్యాంకి బుచ్చి రాజు కథలో కథావస్తువు - కొడుకుని ఒకలాగా కూతుర్ని మరొకలాగా చూడ్డం, నిర్లక్ష్యం చేసిన కూతురే, చివరికి ఆ తల్లికి గతి కావడం ఇదీ కథ భాగీరథమ్మ కూతుర్ని అమ్మి కొడుకుని వృద్ధిలోకి తీసుకువస్తుంది. అమ్మడం అంటే ముక్కుపచ్చలారని కూతురుకి, కన్యాశుల్కం తీసుకొని, ముదుసలికి ఇచ్చి వివాహం చెయ్యడం. వరలక్ష్మమ్మ ఈ కథరాసే నాటికి, ఛాందస బ్రాహ్మణకుటుంబాల్లో కన్యాశుల్కదురాచారం ఇంకా పూర్తిగా రూపుమాసిపోలేదు. వీరేశలింగం పంతులు తన ప్రహసనాల్లోనూ, రచనల్లోనూ, కన్యాశుల్కాన్ని ఎంత విమర్శించినా, గురజాడ అప్పారావుగారు తన కన్యాశుల్కం నాటకంలో ఎంత అధిక్షేపించినా, ఆ దురాచారం, నాటి సంఘంలో ఇంకా అక్కడక్కడ తారట్లాడుతూనే ఉంది వరలక్ష్మమ్మ కన్యాశుల్కం అనే దురాచారాన్ని విమర్శించడానికే ఈ కథాంశాన్ని తీసుకున్నారు. ఈ కథలో రచయిత్రి చెప్పదలచుకొన్న అంశం మరోహటి ఉంది. అదేవిటంటే, దాంపత్యం అన్యోన్యంగా ఉండాలి. కరిమకర సమరంలా ఉండకూడదు.

సమకాలీన సమస్యల్నే ఇతివృత్తాలుగా తీసుకుని వరలక్ష్మమ్మ కథలు రాస్తారు అనడానికి 'దీర్ఘ సుమంగళీభవ' మరొక ఉదాహరణ. బేంకి బుచ్చిరాజు కథలో కన్యాశుల్కం కథావస్తువైతే, ఈ కథలో స్త్రీ పునర్వివాహం కథావస్తువు. బాల్యంలోనే భర్తని కోల్పోయిన పార్వతిని, శంకరుడనే యువకుడు, సమాజాన్ని ఎదిరించి, పెళ్ళి చేసుకుంటాడు, ఈ కథలో.

కాపురంలో భార్యాభర్తలమధ్య అపార్థాలు చోటుచేసుకుంటే, వచ్చే అనర్థాల్ని చాటిచెప్పిన కథ 'నేనే అపరాధిని'. ఇందులో భార్యాభర్తలు ఒకరిపట్ల మరొకరు విశ్వాసంతో బ్రతకాలి అని హెచ్చరించారు రచయిత్రి

సవతి పిల్లల్ని అరళ్ళు పెట్టే స్త్రీలుండే రోజుల్లో, అందరూ అలా ఉండరు. జానకి లాంటి ఉత్తమ ఇల్లాండ్రు కొందరుంటారు. వారు తమ సంతోషాన్నీ, ఆనందాన్నీ త్యాగంచేసి, సవతి పిల్లల్ని కన్న పిల్లలకంటే మిన్నగా చూసుకుంటారు. నిజానికి అలా ఉదారంగానే ఉండాలి కూడా ఈ సంగతి చెప్పడంకోసమే ఆమె ఒక కథ రాశారు. ఆ కథ పేరు రెండు కోర్కెలు.

ఆడంబరంకోసం ఆదర్శాలు ఎన్నయినా వల్లించవచ్చు కాని అవస్థ అంతా వాటిని ఆచరణలో పెట్టవలసివచ్చినప్పుడే తెలిసి వచ్చేది, అనే నిజాన్ని, ఎంతో చమత్కారంగానూ మరెంతో చాతుర్యంతోనూ, తెలియబరిచారు వరలక్ష్మమ్మ 'ఒట్టు అనే కథలో.

స్త్రీలకి విద్య అవసరం. అది గుర్తించకపోవడం మూర్ఖం. అడ్డుకోవడం పాపం. ఈ విషయాన్ని కరుణరస ప్రధానంగా వివరించారు వరలక్ష్మమ్మ 'అయితే పాపము లలిత గతి ఏమిటి?' అనే కథలో.

లియో టాల్‌స్టాయ్ వంటి ప్రముఖ రష్యన్ రచయిత ఉదాత్తభావ వాహినికి దీటుగా ఆలోచించి రాసిన 'దరిద్ర నారాయణుడని ఆ జగద్రక్షకుడి బిరుదైతే' అనే కథ ఆకలితీరక అలమటించి పోతూన్న ఓ వృద్ధదంపతుల్ని, శ్రీమంతులూ ధనవంతులూ తరిమివేస్తారు. నోటి దగ్గరి ముద్దని కూడా లాక్కుంటారు. అలాంటిది, చెత్తకుండీల దగ్గర పడేసిన ఎంగిలాకుల్లో ఉండిపోయిన అన్నం తిని, పొట్టపోసుకునే ఒక పేదబాలుడు, ఆ వృద్ధదంపతులకి, తనకి చేతనైన రీతిలో ఆకలిబాధని తీరుస్తాడు భగవంతుడే ఆ బాలుని రూపంలో వచ్చినట్లు రాశారు వరలక్ష్మమ్మగారు టాల్‌స్టాయ్ తన కథలో కూడా ఇలాగే, తన యింటికి భగవంతుడు వస్తాడని ఒక చర్మకారుడు వేచి ఉంటే, ఒకదీనురాలు, పసిబిడ్డ, ఒక ముష్టివాడు, ఒక పళ్ళు అమ్ముకునే ముసలిది ఇలా కొందరు తారసపడతారు వాళ్ళందరినీ ఆదరిస్తాడు అతడు మర్నాడు ఆ చర్మకారుడు ''నువ్వురాలేదేం దేవా?' అని భగవంతుణ్ణి ప్రార్థిస్తే, వచ్చానుకదా అంటూ, తాను అదుకున్న ఒక్కొక్కరి గొంతుతోనూ జవాబు వినిపిస్తుంది చర్మకారుడికి. అప్పుడు చర్మకారుడు అర్థం చేసుకుంటాడు. దేవుడు ఈయీ రూపాల్లో వచ్చాడు అన్నమాట! అవును, అన్నిరూపాలూ అయనవే కదా అని వరలక్ష్మమ్మగారి కథల్లో ఇది అణిముత్యం

'కథ ఎట్లా ఉండాలె?' అనేది ఒక చిత్రమైన కథ, కథకి ఎలాంటి ఇతివృత్తం తీసుకోవాలి, ఎంతలలితంగా సహజంగా కథని చెప్పాలి, శైలి, రసం, నీతి, ఏ ఏ పరిమాణాల్లో ఉండాలి, వంటి ఎన్నోకథా రచన కళావిశేషాల్ని కొందరు వ్యక్తుల మధ్య సాగిన సంభాషణ ద్వారా, కొన్ని సన్నివేశాల ద్వారా, ఒక చిత్రమైన కథగా అల్లిచెప్పడం, ఈ కథలో విశేషం. దీని ఇతివృత్తం, మంచి కథకి ఉండవలసిన లక్షణాలు వివరించడం. కథలో ఉపదేశికత్వం కనిపించదు. కాని కథని చదవడం పూర్తిచేసేటప్పటికి, మంచి కథ అంటే ఏమిటో అది ఎలా ఉంటుందో అర్థం అవుతుంది పాఠకుడికి.

'పెన్షన్ పుచ్చుకున్ననాటిరాత్రి' అనే శీర్షికని బట్టే ఆకథ ఇతివృత్తం అర్థం అయిపోతుంది. ఉద్యోగ విరమణతో జీవితం ఒక్కమారుగా అస్తవ్యస్తమైపోతుంది నైరాశ్యం, దిగులు, విరక్తి రాబడి తగ్గేసరికి భవిష్యత్తంటే ఏర్పడే భయం ఇవన్నీ ఎంతో కరుణరస ప్రధానంగా పాఠకుడికి అనుభూతం అయ్యేలా చెప్పి, అతనిలో స్పందన కలిగిస్తారు రచయిత్రి.

ప్రతివారికీ, బాల్యమూ, బాల్యంలో తాముగడిపిన జీవితం, ఆటపాటలతో తాము పెరిగి పెద్దదైన ఊరూ, వాటి తాలూకు జ్ఞాపకాలూ, ఇవన్నీ అమృతతుల్యంగా ఉంటాయి అయితే, కొన్ని సంవత్సరాలు గతించేసరికి, బాలుడు బాలుడుగా ఉండడుగా? అతనిలో

ఎన్నో పరిణామాలు వస్తాయి అలాగే బాల్యంలో మనం గడిపిన ఊరూను నాడున్నట్లు నేడు ఉండదు. ఆ ఊళ్ళో కొన్ని మధురమైన జ్ఞాపకాలు, మరిచిపోలేని ఆత్మీయతలు మిగిలి ఉన్నా, మారిన పరిస్థితులవల్ల, ఎన్నో మార్పులు వచ్చి, బాల్యంలో ఆ ఊరు అందించిన ఆనందాన్నీ సంతృప్తినీ తిరిగి మనం పొందలేం కొన్నాళ్ళు పోయాక వెళ్లి చూస్తే అది మన ఊరేనా అనిపిస్తుంది. మనస్సులో అనుబంధం ఎంత ఉన్నా, అక్కడ ఇమడలేం. 'మావూరు' కథలో ఈ విషయాల్ని క్రొత్త పాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు చిమ్మగా' అన్నట్టు, సాంప్రదాయ పరిణామ జీవితాల్ని పడుగూ పేకలాగా అల్లి, చూపిస్తూ మనోహరంగా రాశారు.

ఇలాగే ఆమె రాసిన కథలన్నీను.

ప్రతి కథలోనూ సమకాలీన సమాజం కథావస్తువు మారుతూన్న పరిస్థితులూ, మారుతూన్న ధోరణులూ, వాటి మంచిచెడ్డలూ, పాతని ఎంతవరకూ అనుసరించాలి, క్రొత్తని ఎంతవరకూ ఆహ్వానించాలి, సంప్రదాయంలో జాతికి మేలు కూర్చేది ఎంత? చెరుపు చేసింది ఎంత? సమాజ సంస్కరణ సాగవలసింది ఏ రంగాల్లో ఎంతవరకు? ఏవం విధమైన సమకాలీన సామాజిక స్వరూపం, వరలక్ష్మమ్మగారి కథల్లో కథావస్తువుగా భాసించి-రాణించింది. ఆరోజుల్లో అభ్యుదయ మార్గంలో ఆలోచిస్తూ, సంఘాన్ని సన్మార్గానికి మళ్ళించాలనే లక్ష్యంతో, ఉన్న పరిస్థితుల్ని చిత్రిస్తూ, ఉండవలసిన స్థితిని సూచిస్తూ, సాగిన కథలు ఆమెవి.

ఆ కథల్లో, కథావస్తువు కూడా, అందుకు అనుగుణమైనదీ. అసహజత్వం ఏమాత్రం లేకుండా, చక్కని కథనంతో సాగినదీను.

**కథానిర్వహణ :** శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ కథలురాసే నాటికి అనగా 1920-1940 మధ్య కాలంలో, కథానిక ప్రక్రియకి విస్తృతి లభించింది, కాని, కథా నిర్మాణంలోనూ, కథనంలోనూ, కథానికకి సంబంధించిన శైలి, శిల్పం, సంక్షిప్తత, సమగ్రత, ఏకాగ్రత, వ్యష్ట్యైక్యత (డిక్షన్, స్టైల్, బ్రెవిటీ, టోటాలిటీ, యూనిటీ) వంటి ముఖ్యమైన అంశాలకి ఒక పరిణతి రాలేదు. అలాగే ఛాయావాదం, మార్మికవాదం, అధివాస్తవిక వాదం వంటి వాదాలేవీ తెలుగు కథానికలోకి ప్రవేశించలేదు. అందువల్ల కథా నిర్మాణం, కథా నిర్వహణ, వంటి పదాలు ఉపయోగించేటప్పుడు, నేటి కథల దృష్ట్యా ఆమె కథల్ని పరిశీలించడానికీ, వీటితో వాటిని పోల్చడాకీ వీల్లేదు.

ఆ రోజుల్లో వ్రాసిన శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి కథలతో సహా, నాటి కథకులందరి కథలూ, ప్రత్యేకంగా ఉండేవి వాటి రూపం వేరు. వాటి లక్షణాలు వేరు. వరలక్ష్మమ్మ కథలు కూడా ఆ రూపంలోనే. ఆ లక్షణాలతోటే ఉన్నాయి.

వరలక్ష్మమ్మ కథలు నిడివిలో పెద్దవి. పుస్తక రూపంలో వేస్తే ఒక్కొక్క కథ ఇర్వై ఇర్వై అయిదు పేజీలు కూడా ఉంటుంది. అంతే కాదు. కొన్ని కథలు ప్రకరణాలుగా కూడా విభక్తమై ఉన్నాయి. అంటే నవలలోలాగ కథలో కూడా ఏడెనిమిది ప్రకరణాలుండడం. కొంత కథ ఒక ప్రదేశంలో, ఒక సమయంలో జరిగితే, మిగిలిన కథ మరో ప్రదేశంలో మరో సమయంలో జరుగుతుంది నేటి దృష్టితో చూస్తే, అవి కథానికలు కావు. పెద్ద కథలు, లేదా, నవలికలు. కథాకాలం కూడా నెలలూ, సంవత్సరాలూ. కథ ప్రారంభమయి చివరికి పరిసమాప్తి అయేలోగా, ఎన్నో ఊళ్ళలో కథ నడుస్తుంది. పాత్రలు కూడా చిన్నవాళ్ళు పెద్దవాళ్ళు అవుతారు.

మరో సంగతి-కథలో సూచించి వదిలెయ్యడం, స్పృశించి ఊరుకోవడం ఉండదు. ప్రతీదీ వివరించడమే-రచయిత్రి తనకు తానుగా కథ చెప్పుకువెళ్ళడమే-తాను అదృశ్యంగా ఉండి పాత్రల చేత, కథని నిర్వహింప జెయ్యడం లేదు, ఒకటిరెండు కథల్లో తప్ప కథల్లో నాటకీయతకంటే, సంభాషణలకంటే, సంఘర్షణలకంటే, వివరణాత్మకంగా చెప్పడం, వర్ణనా, కథనం, ఇవే ఎక్కువగా కనిపిస్తాయి.

కథ సాగుతూ ఉండగా రచయిత్రి ప్రవేశించి, తన అభిప్రాయాల్ని చెప్పడం, పరిస్థితిని తన మాటలతో విశ్లేషించి పాఠకునికి వివరించడం, మధ్యలో సామెతలు ఉపయోగించడం, ఇలారచయిత్రి జోక్యం ఎంతో కనిపిస్తుంది.

సంక్షిప్తత లేదు. కాని వరలక్ష్మమ్మగారి కథల్లో సమగ్రత (టోటాలిటీ) వ్యక్తత (యూనిటీ) సంపూర్ణంగా కనిపిస్తాయి. కథకి సంబంధించినవి తప్ప, అవసరం లేని విషయాలేమీ ఆమె కథల్లో ఉండవు. ప్రతికథలోనూ తప్పకుండా పాత్రలో పరిణామమో, పరిస్థితిలో మలుపో, ఉంటుంది.

ప్రతి కథా ఏదో ఒక సామాజిక ప్రయోజనాన్ని ఉద్దేశించి రాసినదే-అంటే ఒక్కొక్క కథని ఆమె ఒక్కొక్క లక్ష్యంతో రాశారు. లక్ష్యశుద్ధి, లక్ష్యసిద్ధి, అన్ని కథల్లోనూ ఉంది. చాలా కథల్ని ఆమె గంభీరంగానే రాశారు. కొన్నింటిని మాత్రం కొంచెం హాస్యం జోడించి రాశారు. హాస్యం ఎక్కడా హద్దుమీరలేదు. అసంబద్ధమైన ఆచారాల్నీ, ఆలోచనల్నీ, జీవితమార్గాల్నీ సరిదిద్ది, సక్రమమార్గానికి తేవడంకోసమే, ఆమె హాస్యాన్నీ, హేళననీ ఉపయోగించారు.

వరలక్ష్మమ్మ కథలన్నీ సాఫీగా సాగిపోతాయి. కథని అలా అలా చెప్పుకు పోవడమే! తళుక్కుమని మెరిసే చమత్కారం తక్కువ. పాఠకుల్ని మంత్రముగ్ధుల్ని చేసే సన్నివేశ కల్పనలుకానీ, పాత్రల చతుర వచోవిలాసంకానీ, ఆమె కథల్లో కనిపించవు. చదువరిలో ఉత్కంఠ- కలిగించే నిర్మాణ చాతుర్యం దాదాపు లేదనే చెప్పాలి. అయితే మెరుపులు

లేకపోయినా, వరలక్ష్మమ్మ కథానిర్వహణ పద్ధతి, హృద్యమైనదీ, లలితమైనదీ. ఏ కథా రాకెట్‌లా దూసుకుపోదు రహదారీపడవలా నెమ్మదిగా సాగి లక్ష్యం చేరుకుంటుంది.

**భాష :**

కనుపర్తి వరలక్ష్మమ్మ భాష గ్రాంధికం కాదు-అలాగని గ్రామ్యమూకాదు. శిష్ట వ్యావహారికం. చదువు సంస్కారాలతోబాటు, సంఘంలో ఒక నిర్దిష్టమైన స్థానం ఉన్న వ్యక్తులు వాడే భాషని ఆమె తన కథల్లో వాడారు. అటువంటి వ్యక్తుల్నే తన కథల్లో పాత్రలుగా స్వీకరించడంవల్ల, ఆమె ఆ భాషని శ్రమలేకుండా, తమ కథల్లో ఉపయోగించగలిగారు.

ఆ శిష్ట వ్యావహారికంలో మళ్ళీ, కృష్ణా గుంటూరు జిల్లా పలుకుబళ్ళే ఎక్కువ

నవ్వుటాలు

ఎఱుక

త్వరగా

పెందలాడే, వంటి పదాలూ, అన్నది, అన్నాడు వంటి సమాపక క్రియలూ ఇందుకు ఉదాహరణలు.

ఆమె కథల్లో అచ్చ తెలుగు మాటల కంటే, తత్సమ తద్భవపదాలే ఎక్కువ చిన్న చిన్న సమాసాలు కూడా కథ మధ్యలో చోటుచేసుకుంటూ ఉంటాయి.

చదువు సంధ్యల్ని బట్టీ, సామాజిక స్థాయిని బట్టీ, ఆయా పాత్రలూ, వారు వాడే భాషా, వీటిలో కొద్ది కొద్ది తేడాలు సహజంగా ఉంటాయి. దీనికి వరలక్ష్మమ్మ ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వలేదు-ఒకటి రెండు కథల్లో బిచ్చగాడు, నౌఖరువంటి పాత్రల చేత పాత్రోచితమైన భాష మాట్లాడించడానికి రచయిత్రి ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నం ప్రయత్నమే-పట్టుదలగా సాగలేదు.

కథలో సంభాషణ ఘట్టం వచ్చినప్పుడు మాత్రం వరలక్ష్మమ్మ ఆ సంభాషణలు సహజంగా ఉండేలా రాశారు. ఎక్కడా కృత్రిమం, అసహజత్వం కనిపించదు. మరోసంగతి, పురుష పాత్రలు మాట్లాడేతీరు వేరు. స్త్రీ పాత్రల తీరువేరు. ఆడవాళ్లు మాట్లాడే మాటల్లో కొద్దిగా హాస్యం, వ్యంగ్యం, ధ్వని చమత్కారం, పరిహాసం, నాజూకుతనం, చేర్చి, అచ్చంగా తెలుగు అడబడుచులు ఎలా మాట్లాడతారో, తన స్త్రీ పాత్రల చేత అలాగే మాట్లాడించారు

కథల మధ్యలో రచయిత్రి కొన్ని నానుడుల్నీ సామెతల్నీ వాడి, కథలకి అందాన్నీ, సహజత్వాన్నీ సమకూర్చారు. వాటిలో,

కన్నెచిన్నదైనా జన్నిదము పెద్దదైంది కదా!
అతడు పొత్తుగిట్టని పొట్లచెట్టు
పెండ్లాడడానికి ఆడ పిల్లలూ, కనడానికి మొగపిల్లలూ కావాలా?
గ్రామ ప్రజలందరూ అతని పిడికిలిలోని పిచుకలు
ప్రతీక్షించే ఓర్పు మగవాడికి లేదు.

వంటివి కొన్ని. వీటిలో ఎంతో వ్యంగ్యం-మరెంతో అధిక్షేపణ-కనిపించేది హరివిల్లులాంటి అందమైన హాస్యమే-కాని ఆ హరివిల్లుతో సంధించే బాణాలు మాత్రం, వాడి అయినవి-వేడి అయినవీ

వరలక్ష్మమ్మ కథలు రాసే రోజుల్లో పానుగంటి వారి సాక్షి వ్యాసాల ప్రభావం నాటి రచయితలమీద ఉండేది పదాల గారడీ, పందెపు గుర్రాల్లా భావాలూ ఒకదాన్ని ఒకటి తరముకుంటూ రావడం, మాటమీద మాట పేర్చుకుంటూ పోవడం, వాక్యాల దొంతర్లతో పాఠకుని ఉక్కిరిబిక్కిరి చెయ్యడం, ఆ వ్యాసాల ప్రత్యేకత-పానుగంటి వారి వ్యాసాల ప్రభావం, వరలక్ష్మమ్మకథల్లో అక్కడక్కడ కనిపిస్తుంది. ఉదాహరణకి

"తిండి యందెంత మోటయో, పనియందంతమోట-
పనియందెంతమోటయో, ఉనికియందంతమోట
ఉనికియం దెంత మోటయో, మాటయందంత మోట"

మరో ఉదాహరణ :

పండ్లుకండ్లు లేని ముదుసలులకు
పొట్టపొడిచినా అక్షరంముక్కరాని, నిరక్షర కుక్షులకు
గవ్వగడింపలేని అప్రయోజకులకు
కన్యాశుల్కం తీసుకుని కన్యల్ని సమకూర్చే నిర్భాగ్యపు దేశం ఇది

ఇలా సాగే రచనవల్ల, కథా శిల్పానికి భంగం కలుగుతుంది. నిజమే! కాని రచయిత్రికి ఉండే ధర్మాగ్రహం, జరుగుతూన్న అన్యాయాన్ని చూస్తే ఈమెలో పెల్లుబికిన ఆవేశం, ఆమెచేత ఆ భాషని వాడేలా చేశాయి నిర్మాణ సౌందర్యం మీద నీడ పడినా సరే నిజాన్ని బలంగా చెప్పాలి. ఈ పద్ధతి సమాజశ్రేయస్సే లక్ష్యంగా కలం పట్టిన రచయితలందరిలో కూడా కనిపిస్తుంది ఈ నాటికీ

**శైలి :** వరలక్ష్మమ్మగారిది సహజసుందరమైన శైలి. భావానికి తగ్గభాషని వాడతారు. సందర్భోచితమైన సంభాషణ కనిపిస్తుంది ఆమె కథల్లో. చిన్న చిన్న వాక్యాలతో భావ వారధిని నిర్మిస్తారు. అన్వయక్లిష్టత ఆమె రచనల్లో ఎక్కడా కన్పించదు. రచయితని బట్టి, వారి వారి శైలి ఉంటుంది అనేది కనుపర్తివారి విషయంలో కూడా నిరూపితం.

వ్యక్తిగా ఆమె చాలా నిరాడంబరమైనది. ఎవరినీ నొప్పించకుండా మాట్లాడడం ఆమె స్వభావం. మందలించవలసి వచ్చినా, కఠినంగా కాకుండా, మృదువుగా హితవుగా చెప్పేవారు. సౌజన్యానికి ఆమె మారు రూపం అలాగని పరిస్థితులకి లొంగిపోవడం ఆమె స్వభావం కాదు.దృఢంగా స్థిరచిత్తంతో ఉండేవారు.

ఈ లక్షణాలన్నీ ఆమె రచనల్లో కనిపిస్తాయి. బరువైన, బలమైన, భావాలే కాని, అభావాల్ని అందించే భాష మాత్రం, అందుకు తగినట్లు బలంగా ఉంటుందే కాని, కఠినంగా ఉండదు. నిజాయితీ అయిన వ్యక్తి కనుక, ఆమె శైలిలో కూడా దర్పం ఆర్భాటం కనిపించదు. వరలక్ష్మమ్మ కథల్లోనూ రచనల్లోనూ కనిపించే శైలి, ఆమె వ్యక్తిత్వానికి అద్దం లాంటిది. Style is the man (or woman) అనే మాట ఆమె పట్ల అక్షరాలా సత్యం.

కథానికా లక్షణాలేవిటి?

అసలు, కథ ఎట్లా ఉండాలి?

అనే ప్రశ్నలు వేసుకొంటే ఆ ప్రశ్నలకి వరలక్ష్మమ్మగారి దగ్గర తగిన సమాధానాలున్నాయి.

''కథ ఎట్లావుండాలె?'' అనే శీర్షికతో ఆమె ఒక కథనే రాశారు. ఆ కథలో రాఘవరావు, రాజేశ్వరి అనే పాత్రల మధ్య సాగిన సంభాషణల్లోని కొన్ని భాగాల్ని చూస్తే, కథానిక పట్ల ఆమెకి గల అభిప్రాయాలు అర్థం అవుతాయి.

ఆ కథలోని కొన్ని భాగాలు

''కథా వాఙ్మయంగాని, గేయ వాఙ్మయంగాని ఆంధ్ర భాషా వధూటికి సరిక్రొత్త సొమ్ములు కావు. భట్టి విక్రమార్కుడి కథలూ, కాశీమజిలీ కథలూ, పంచతంత్ర కథలూ, పన్నిద్దరు రాజుల కథలూ అంటూ ఎన్నెన్నో కథలు, అనాదినుంచీ మన దేశంలో వాగ్రూపకంగానూ, గ్రంథస్థంగానూ కూడ వాడుకలో ఉన్నవే. ఇక జోలపాటలు, దంపుళ్ళ పాటలు, మున్నగు పాటలలో ఉన్న మాధుర్యం, నేడు వస్తూన్న ఏ భావకవితకూ తీసిపోదు''.

''మానవులకు కథాప్రియత్వం సహజసిద్ధం. లోకంలో ప్రతితల్లీ, ప్రతిబిడ్డకూ కథాబోధ వల్లనే, లోకజ్ఞానం కలుగజేస్తున్నది.''

''ఏదైనా ఒక కథ వ్రాశాము అంటే అది సర్వవిధాకర్షణ కలదిగా ఉండాలి.''

''మనోహరమైన ఒక గులాబి పువ్వు యొక్క ఆకృతి, రంగు, మృదుత్వము, పరిమళము, మకరందము, మననెట్లా ఆకర్షిస్తూ ఉంటాయో, కథాకుసుమంకూడా కల్పన అనే ఆకృతి, వర్ణన అనే రంగూ, శైలి అనే మృదుత్వమూ, రసము అనే పరిమళమూ, నీతి

అనే మకరందమూ కలిగి, ఆకర్షవంతమైనదిగా ఉండాలి. ఇందులో ఏది లోపించినా కథా కుసుమం రాణించదు.''

''వర్ణనలు సహజం అయినా ఉచితాన్ని మీరకూడదు''

''రసమెప్పుడూ, పూవులో తావివలె వాక్యంలో మిళితమై ఉండాలి అందులో హాస్యరసం విషయంలో అది ఎంత గర్భితంగా ఉంటే అంత మనోహరంగా ఉంటుంది''.

''ప్రతి రచనలోనూ నైతికమైన లేక వైజ్ఞానికమైన ఒక సత్య వస్తువు ఉండాలి. తాత్కాలికోల్లాసమే కథయొక్క ఉద్దేశమైతే, అందు ప్రణయ వ్యవహారాలే ముఖ్య వస్తువులైతే, అవి తప్ప రచయితలు వ్రాయలేకపోతే , అవే తప్ప పాఠకులకి రుచించకపోతే, ఆ కథలూ, కథకులూ, ఆ కథాపాఠకులూ, భ్రష్టమార్గం పట్టినట్లే''

'శైలి మాధుర్యం, వర్ణనా చాతుర్యం, కల్పనా సౌందర్యం రసౌచితం, నైతికాదర్శం గలవే ఉత్తమశ్రేణి కథలు. అవే వాఙ్మయంలో స్థిరమైన స్థానం సంపాదించుకుంటాయి. ప్రజాదరణ పొందుతాయి. వీటికి పాత బడిపోవడమంటూ ఉండవు. రవీంద్రుని కథలు ఇటువంటి శ్రేణికి చెందినవే! అతడు ఏ నీతినీ ఏ ధర్మాన్నీవెల్లడిగా ఏకరువు పెట్టడు. అయినా ప్రతికథా ఏదో ఒక ఉత్తమాదర్శాన్ని వ్యక్తీకరిస్తూనే ఉంటుంది. అన్ని గుణాలూ ఉండి, నైతికాదర్శం లేకపోతే అవి ఉత్తమ కథలు కాలేవు. మధ్యమ కథలవుతాయి. అవి తాత్కాలికమైనవే - శాశ్వతంగా వాఙ్మయంలో నిలబడవు. ఇక వెకిలిగా భావోద్రేకంతో వ్రాసే కథలు, అధమ తరగతికి చెందినవి. ఇవాళ తెలుగు పత్రికల్లో ప్రచురిస్తూన్న కథలు, చాలవరకు ఈ అధమ తరగతికి చెందినవే''

''కథారచన ఒక కళావిశేషమే! దానిని నీతి అనే చట్రంలో బిగించి నిర్దిష్ట ప్రయోజనానికి ఉపయోగించడం నిజానికి తగదు. కాని ప్రయోజనం లేని కథరాయడం కూడా తగని పనే! అందువల్ల సామాజిక శ్రేయస్సు అనే ముద్ద బంగారాన్ని, రచనా కౌశల్యం అనే నగిషీతో చేర్చి, అందమైన ఆభరణంలా మార్చాలి. అదే ఉత్తమమైన కథని రాసే పద్ధతి-అందులో బంగారంలాంటి ప్రయోజనం, నగిషీపని లాంటి తళతళలాడే కథానిర్మాణ కౌశల్యం రెండూ ఉంటాయి. ప్రేమ్‌చంద్, ఠాగూర్, టాల్‌స్టాయ్ వంటి ఉత్తమ కథారచయితల కథారచనా విధానం అదే! అందుకే అవి ఇతర భాషల్లోకి తర్జుమా అయ్యాయి. తెలుగు కథలు కూడా ఆ స్థాయికి చేరుకోవాలి. ఇతర భాషల్లోకి తర్జుమా అయే స్థాయి అంటే, ప్రయోజనాత్మకమైన కథా వస్తువు ఉండడం. ప్రతిభావంతంగా కథానిర్మాణం సాగడం-ఈ రెండూ, కథలో సమ్మేళణం చెందడం''

పైన ఉదహరించిన బావాలు, వరలక్ష్మమ్మ రాసిన 'కథ ఎట్లా ఉండాలె' అనే కథలోనివి.

దీన్నిబట్టి కథ పట్ల ఆమెకి గల అవగాహన ఏమిటో, ఆమె భావ సరళి ఏమిటో, కథ ఎలా ఉండాలి అని ఆమె ఆశించారో, ఇవన్నీ అర్థమౌతాయి.

**జీవిత సూక్తం :** ఒక లక్ష్యం, ఒక ఆశయం, ఒక పరమార్థం ఏం లేకుండా, రచన సాగించడం అంటే, గమ్యం ఫలానా అని నిర్ధారణ చేసుకోకుండా ప్రయాణం ప్రారంభించడం లాంటిది. ప్రపంచంలో ఏభాషలోనైనా సరే, పది కాలాల పాటు నిలిచిన రచనలన్నీ, లక్ష్యశుద్ధితో రాసినవే. అంటే ప్రతి రచయితా ఏదో ఒక లక్ష్యాన్ని కాంక్షించే కలం పట్టారు, కనుపర్తి వరలక్ష్మమ్మ కూడా అంతే.

మొదట్లోనే చెప్పినట్లు ఇది ధర్మం ఇది అధర్మం అని ప్రబోధించడానికి, అవినీతి మార్గంనుంచి తన తోటి వారిని మళ్ళించడానికి సమాజంలో స్త్రీకి జరుగుతూన్న అన్యాయాల్ని అరికట్టడానికి ఆమె రచనలు చేశారు ఆమె రాసిన కథలూ, వ్యాసాలూ, నాటికలూ, కవితలూ, ఒకటేమిటి, ఆమె వాఙ్మయం యావత్తూ ఆ లక్ష్యసాధన వైపే నడిచింది.

సంఘంలో పాతుకుపోయిన బాల్యవివాహ, కన్యాశుల్క వరవిక్రయాది దురాచారాల్ని విమర్శిస్తూ ఆమె కథలు రాశారు.

అలాగే ఆడంబర జీవితాన్నీ, సాంసారిక జీవితంలో తరుచు తలెత్తే అపార్థాలనీ, విదేశీ నాగరికత పట్ల వ్యామోహాన్నీ, కూతుళ్ళపట్ల చూపే నిరాదరణనీ కొడుకులపట్ల పెంచుకొనే వెర్రి వ్యామోహాన్నీ తన కథల్లో నిరసించారు.

సాటి మనిషికి సాయం చెయ్యమన్నారు. కాఠిన్యం వద్దన్నారు. ప్రేమించడం మంచిదన్నారు. మనిషికి ఋజువర్తన అవసరం అన్నారు. సభ్యతా, సంస్కారం, సంప్రదాయం ఇవన్నీ అవసరం. అలాగని పాతది ప్రతిదీ శిరోధార్యం కాదు కాలానుగుణంగా ఆచారాలూ, జీవన పద్ధతులూ, మారుతూ ఉండాలి అన్నారు.

అధర్మం, అవినీతి, అన్యాయంలేని ఒక నవ సమాజ సౌధం, ప్రేమ, దయ, సౌజన్యం, సమానత్వం అనే నాలుగు మణిస్తంభాల పై, పునర్నిర్మితం కావాలని, అదే ధ్యేయంగా అదే లక్ష్యంగా రచనలు చేసి, తన జీవిత సూక్తాన్ని రచనలద్వారా అందించారు, కనుపర్తి వరలక్ష్మమ్మ.

కథలతోబాటు సమానంగా, సమర్థంగా, ఆమె చేపట్టిన మరో సాహిత్య ప్రక్రియ 'లేఖా' సాహిత్యం. వరలక్ష్మమ్మగారి చేతిలో కొత్తలోకాల్ని పాఠకులకి ఆవిష్కరించింది. ఆంధ్రసాహిత్య చరిత్రలో వరలక్ష్మమ్మగారికి సముచిత స్థానాన్ని సంపాందించిపెట్టినవి 'శారదలేఖలు'.

**శారదలేఖలు :** వరలక్ష్మమ్మ శారద లేఖల్ని కేసరిగారు 1928లో ప్రారంభించిన గృహలక్ష్మి ప్రథమ సంచికతోటే మొదలు పెట్టారు కేసరిగారు ''మాసపత్రికకి ఏదైనా రాసివ్వండి'' అని అడిగితే, అలాగేనని ఆమె మొదటి శారద లేఖని రాసి గృహలక్ష్మి ప్రథమ సంచికకి పంపారు-అది మొదలు గృహలక్ష్మిలో వరుసగా దాదాపు ఆరు సంవత్సరాలు, అనగా 1934 వరకూ శారద లేఖలు రాశారు. అవి గృహలక్ష్మి పత్రికకి అపురూపమైన ప్రతిష్టనీ, రచయిత్రి అయిన వరలక్ష్మమ్మగారికి అసమానమైన కీర్తినీ అర్జించిపెట్టాయి.

'కల్పలత' అనే స్నేహితురాలికి 'శారద' అనే వ్యక్తి, రాసిన లేఖలుగా, వీటిని వరలక్ష్మమ్మ రూపొందించారు ఛెస్టర్‌ఫీల్డ్స్ లెటర్స్ టు హిజ్‌సన్, ఆలాగే పండిట్ జవాహర్‌లాల్ నెహ్రూ తన కుమార్తె ఇందిరాగాంధికి రాసిన లేఖలు, ఆంగ్లంలో ప్రఖ్యాతమైనవి. సాహిత్యస్థాయికి ఎదిగి, ఆంగ్లభాషలో, లేఖా సాహిత్యం అనే ఒక క్రొత్త విభాగానికి అవి బలం చేకూర్చాయి.

అయితే, తెలుగులో 'లేఖసాహిత్యం' అనేది శారద లేఖలతోనే ప్రారంభం అయింది. అంతకుముందు సాహిత్యస్థాయిని గడించుకొన్న లేఖలు అప్పుడప్పుడు నుకవుల మధ్య నడిస్తే నడిచి ఉండవచ్చు కాని అవన్నీ సమీకరించి, ఎవరూ ప్రక్రియగా వాటికి ఒక రూపం కల్పించలేదు. అ పని వరలక్ష్మమ్మ చేశారు తెలుగులో లేఖా సాహిత్యానికి పునాది ఏర్పడింది, అది పటిష్టం అయిందీ, ఆమె వల్లనే.

వరలక్ష్మమ్మ చిన్నపిల్లగా ఉన్నప్పుడు అనగా మూడవక్లాసు చదువుతూన్న రోజుల్లో, తమ ఇంటిప్రక్క ఇంట్లో ఉండే చదువురాని ముసలమ్మలకి వచ్చిన ఉత్తరాలు, వాళ్లకే చదివి వినిపిస్తూ ఉండేది. అంతే కాదు, ఆ ఉత్తరాలకి జవాబులు రాయవలసి వచ్చినప్పుడు వాళ్ళు, ఏవేవో చెప్పేవారు. ''ఇవన్నీ వ్రాయితల్లీ'' అని వరలక్ష్మమ్మని అడిగేవారు. అలా చెప్పేవి అన్నీ ఒక క్రమంలోనూ ఒక పద్ధతిలోనూ ఉండేవి కావు. వాళ్ళు మహారాష్ట్రనుండి వచ్చినవారు. గోల్కొండ వ్యాపారులు-వారి తెలుగు కూడా అంతంత మాత్రమే-అందువల్ల, వాళ్ళ భావాల్నీ భాషనీ ఒక క్రమంలో ఏర్పరచి, జాబుగా రూపొందించవలసి వచ్చేది అది కూడా అంత చిన్న వయస్సులో-అలా వాళ్ళకి ఉత్తరాలు రాసి పెట్టడానికి పడిన ఇబ్బంది, చేసిన కృషి వరలక్ష్మమ్మకి ఆ తర్వాత ఎంతో ఉపయోగపడింది శారద లేఖలు రాయడానికి.

గృహలక్ష్మి పత్రికలో ప్రకటితమై, ఆ తర్వాత సంపుటాలుగా వచ్చిన శారదలేఖలు, ఆంధ్ర దేశంలో బహుళ ప్రచారం చెందాయి. వాటికి ఎంతో ప్రఖ్యాతి లభించింది. ఆ రోజుల్లో కాస్తాకూస్తా చదువుకొన్న ప్రతి కుటుంబంలోనూ, ప్రతి ఇంట్లోనూ, కనుపర్తివారి శారద లేఖల సంపుటాలు ఉండేవి. తల్లావఝ్ఝల శివశంకరస్వామి అన్నట్లు ''మూడు దశాబ్దాల ఆంధ్రజీవిత రేఖలు ఈ లేఖలందుకానబడుచున్నవి. అంతే కాదు ఈ లేఖలు, ఆరేఖల్ని తేజస్వంతం చేసినవి.''

నాటి స్త్రీలలో విద్యావంతుల సంఖ్య తక్కువ అందువల్ల సామాన్య స్త్రీల విద్యాస్థాయికీ అవగాహనాశక్తికీ అనుగుణంగా ఉండేలాగ ఎన్నో విజ్ఞాన దాయకమైన విషయల్ని లేఖల ద్వారా అందించారు వరలక్ష్మమ్మగారు అవి హితవు గరి పే మాటలు. ప్రేమతో చెప్పే పలుకులు.

శారద లేఖల్లో వరలక్ష్మమ్మ సమకాలీన సమాజంలో ఉన్న సమస్త విషయాల్నీ ప్రస్తావించారు. చర్చించారు. కొన్ని సమస్యల్ని విశ్లేషించి విమర్శించి వాటికి పరిష్కార మార్గాలు కూడా సూచించారు. అవి కేవలం లేఖలేకాదు మనకచీకట్లో తారట్లాడుతూన్న మనుష్యులకి కరదీపికలు. దిక్కుతోచక నిలబడిపోయినవారికి, మార్గదర్శకాలు, వివేకం సన్నగిల్లిన వారికి వివేక చంద్రికలు.

ఒక్కొక్క లేఖ ఒక్కొక్క మణిపూస
ఓ లేఖలో మూఢ విశ్వాసాల్ని ఖండించారు.
మరోలేఖలో, బాలవితంతువుల బాధల్ని హృదయవిదారకంగా వివరించారు
ఒక లేఖ పురుషాధిక్యతని తెగనాడే కరారి.
ఒకటి వరకట్న దురాచార సంహారి
విదేశవస్తు బహిష్కరణని ఒక లేఖలో ప్రస్తావిస్తే,
రాట్నం పై నూలు వడకాలని మరో లేఖలో ప్రస్తావించారు.

పుణ్యక్షేత్రములు, వనమహోత్సవములు, ఆయుర్వేద హోమియోపతి వైద్య విధానముల విశిష్టత, పొదుపు ఉద్యమము, వ్యాయామము, విద్యావిధానము, పాఠ్యపుస్తకములు-జాతీయకరణ, భారత దేశ దర్శనము, వర్ణ విపక్షత, నాణెములు తూకములు కొలతలలో వచ్చిన మార్పులు, శబ్దవిస్తరణ యంత్రముల (Microphone) కోలాహలము-ఇలా ఒకటేమిటి? సమస్త విషయాల్నీ ఆమె తన లేఖల్లో ప్రస్తావించారు.

శారదాచట్టం, విడాకుల చట్టం, గాంధీగారి ఖద్దరు ప్రచారం, సహాయ నిరాకరణోద్యమం, అస్పృశ్యతా నివారణ, హరిజన దేవాలయ ప్రవేశం, మద్యపాన నిషేధం, తీర్థయాత్రల ప్రభావం, విగ్రహారాధనలోని మంచిచెడులు మూఢభక్తులు, దొంగసన్యాసులు, వరకట్నాలు, బహుభార్యాత్వం, వేశ్యావృత్తి బహిష్కరణ వంటి అనేకానేక విషయాల్ని, స్త్రీపురుష మనస్తత్వాల్ని మధ్యమధ్య విశ్లేషిస్తూ, సమయోచిత పరిహాస భాషణాలు సాగిస్తూ, చిరకాలస్తవనీయాలైన రసఖండాలుగా, ఆయా లేఖల్ని ఆమె తీర్చిదిద్దారు. నాటి సాంఘిక, రాజకీయ, మతవిషయికాలైన చర్చల్లో, వివాదాల్లో వరలక్ష్మమ్మ అవలంబించిన నిష్పాక్షిక వైఖరి ఈ లేఖల్లో ప్రతిబింబించి, జనావళిని జాగృతం చేశాయి సంఘంలో సంస్కరణ బీజాల్ని పాదుకొల్పాయి. ఈ లేఖలు నాటి స్త్రీ జాతిని వెన్నుచరిచి గాఢ తమస్సునుండి

సుషుప్తినుండి లేపాయి. భాష తేలిక-తీరు అతిస్పష్టం. చదివించేమార్గం సుగమం. రీతి నిర్భీతి. శారద లేఖలు, ఆనాటి స్త్రీజీవితాలనూ, సమస్యలనూ, చర్చిస్తూ వారి వికసించే మేథకూ, విస్మృతమౌతూన్న విద్యకూ, ప్రతీకలు. సాహిత్యాకాశంలో ఎన్నటికైనా నిలిచిపోయే ధృవతారలు.

శారద లేఖల్ని వరలక్ష్మమ్మ పుస్తకరూపంలో రెండు సంపుటాలుగా వెలుపరించారు. మొదటి సంపుటాన్ని గృహలక్ష్మి అధిపతులు కేసరిగారే సంపుటంగా ముద్రించి రచయిత్రికి బహుకరించారు రెండవ సంపుటాన్ని, అప్పటికి స్వర్గీయులైన తన భర్త శ్రీ కనుపర్తి హనుమంతరావుగారికి అంకితం ఇచ్చారు. అంకిత పద్యాలు కూడా రాశారు.

దానికి రాసిన పీఠికలో శ్రీ శివశంకరస్వామి,

''శారద లేఖలతో వరలక్ష్మమ్మగారి యశస్సు యావదాంధ్ర దేశమున వ్యాపించినది. లేఖలు సారస్వత ప్రక్రియలలో ఒకటి. ఈ ప్రక్రియ ద్వారా వర్ణనలు చేయవచ్చును. కొన్ని సంగతుల్ని ప్రస్తావించవచ్చును. ప్రయాణ వివరములు వ్రాయవచ్చును. సాంఘిక సారస్వతాది విషయములు వివరించవచ్చును. ఎన్నిరకములైన విమర్శలైనను చేయవచ్చును. ఈ లేఖలలో ఒక విశిష్టత కలదు. వరలక్ష్మమ్మగారు సహజముగా, దేశాభిమానము, సంఘాభిమానము ధార్మిక దృష్టికలదియగుటచే, దేశమున కుపకరించు వివిధ విషయములను విమర్శించుచు, ఉదాత్తమార్గములో ఈ లేఖలు వ్రాసినది. తమ అభిప్రాయములను ఊరికే వెల్లడించి సంతృప్తి చెందుటకాక, జనులు ఆయా సందర్భములలోనెట్లు ప్రవర్తింపవలెనో, ఏవిధముగ తమ నడపడి సరిదిద్దుకొనవలెనో కూడ సూచించినది.

'' ఈమె నిర్భీకురాలు, కావుననే బహువిషయములను బాగుగా చర్చించి ధైర్యముతో తీర్పు చెప్పగలిగినది వాటిలో బ్రాహ్మణ శూద్ర శబ్ద విచారమొకటి. ''బ్రాహ్మణ శబ్దమునకెంత గౌరవము కలదో శూద్ర శబ్దమునకు కూడ అంతే గౌరవము కలదు. ఆమె అన్నట్లు శూద్ర శబ్దమునకు నిందార్థములేదు నేటి రచనలలో బ్రాహ్మణులను అవహేళనచేయుట ఉన్నది. అది తగదు అనాదిగావచ్చుచున్న బ్రాహ్మణ అనే పారిభాషిక పదము, తటాలున ఎట్లు అంతర్ధానము కాగలదు?'' ఇలా వ్రాయుటలో ఆమె నిర్భీకత్వము తెలియును

''వరలక్ష్మమ్మ శారద లేఖలను సరళ గ్రాంథిక భాషలో చక్కగ రచన చేసినది. ఆమె భాష ఉదాత్తమై, ధారాళమై, శ్రవణ సుభగమై హృదయరంజకముగా నుండును, వచన రచనలో ఉదాత్తులగువారు ఇటువంటి వ్యక్తుల రచనలను పఠించినచో, మంచిరీతి అలపరచుకొనవచ్చును ఈ లేఖలు పఠించినచో రచయితలకు ఉదారమైన శైలి మాత్రమే కాదు, పాఠకులందరి హృదయములలోనూ ఉదారమైన భావములు కూడా ఏర్పడును

''లేఖలలో ఆంధ్రోద్యమము, ఆంధ్ర భాషాభిమానము, హిందీ భాషా వ్యాప్తి, స్వరాజ్య సంపాదన, సంఘ సమస్యలు, పుణ్యతీర్థయాత్రలు, కొన్ని ప్రసిద్ధమైన గ్రంథములు, కొందరు సుప్రసిద్ధ నాయకులు, మత విషయములు, మమతలు, ఇత్యాదులు ఎన్నో సవిమర్శకముగా సందర్భోచితముగా గోచరించును. రమారమి మూడు దశాబ్దుల ఆంధ్రజీవిత రేఖలు, ఈ లేఖలందు కానబడుచున్నవి''

అంటూ శారద లేఖల ప్రాశస్త్యాన్ని శ్లాఘించారు.

ప్రతి లేఖనూ ''సౌభాగ్యవతి కల్పలతకు-నెచ్చెలీ'' అనే సంబోధనతో ప్రారంభించి, యోగక్షేమములూ, సామాన్యమైన సంగతులూ ప్రస్తావిస్తూనే, అలా అలా అసలు విషయములోనికి తీసుకువెళ్ళి, గంభీరమైన సమస్యల్ని చర్చించి, పాఠకునిలో ఉదాత్తభావతరంగాల్ని సృష్టించి, ఉత్తేజంకలిగించి, తిరిగి సాంసారికమైన సామాన్య విషయాల్ని ప్రస్తావిస్తూ, పరిసమాప్తి చెయ్యడం ఆమె పద్ధతి-మధ్యలో చతురతలూ, పాటలూ, పద్యాలూను-ప్రతిలేఖా ఆద్యంతమూ ఒక కళాఖండము.

**మా చెట్టు నీడ ముచ్చట్లు :** కథలు, శారద లేఖల తర్వాత వరలక్ష్మమ్మగారి ప్రజ్ఞా పాటవాలకి అద్దంపట్టేవి మా చెట్టు నీడ ముచ్చట్లు రచనా కౌశలము, సాహిత్యస్థాయి, వీటిని బట్టి, ఈ ముచ్చట్లకి మూడవస్థానం ఏర్పడింది కాని, రచనా కాలాన్ని బట్టి, ఈ వ్యాస పరంపరది ప్రథమస్థానమే! ఏమంటే, శారద లేఖల ప్రారంభం 1928. కాని, మా చేట్టు నీడ ముచ్చట్లు ప్రారంభం 1922లోనే.

ఈ వ్యాసపరంపరని ఆమె 1922లో ఆంధ్రపత్రికలో ప్రారంభించారు. అయితే వీటిని 'లీలావతి' అనే కలం పేరుతో రాశారు. వివిధ ప్రదేశాలకి చెందిన అయిదుగురు మహిళలు, తమ తమ పురుషుల ఉద్యోగరీత్యా, కృష్ణా జిల్లా బెజవాడలో, ఒక ఇంట్లోగల తమ తమ వాటాల్లో కాపురముంటూ, తీరిక సమయంలో, ఆ యింట ముంగిట ఉన్న నారింజ చెట్టు క్రింద కూర్చుని, ముచ్చట్లాడుకుంటూన్నట్లు వ్రాసిన వ్యాస పరంపర ఇది.

ఆ అయిదుగురు మహిళల్లోనూ ఒకామె మంగళాంబ. ఆమెది మద్రాసు. రెండవవారు కనకమ్మ. ఆమె ఊరు నెల్లూరు. మూడవ వ్యక్తి కళ్యాణి. కర్నూలు ఆమె స్వస్థలం. నాల్గవ మహిళ సూరమ్మ. ఆమె విశాఖపట్టణానికి చెందినది. అయిదవ స్త్రీ గుంటూరు నుంచి వచ్చిన వరలక్ష్మమ్మ. వివిధ ప్రాంతాలకి చెందిన ఈ అయిదుగురూ సాగించిన ముచ్చట్లే, మా చెట్టు నీడ ముచ్చట్లు.

ఇలా అయిదు ప్రాంతాల మహిళలు ఒకచోట చేరినప్పుడు, వాళ్ళకబుర్లు ఎలా ఉంటాయో, వాళ్ళ ముచ్చట్లు ఏ మార్గంలో కొనసాగుతాయో ఊహించి చక్కని వ్యాసాలుగా, రాశారు వరలక్ష్మమ్మ, లీలావతి అనే కలం పేరుతో. ఆంధ్రపత్రిక

పాఠకులందరూ ఈ లీలావతి ఎవరా అని ఆశ్చర్యపోయారు. వరలక్ష్మమ్మ ఆ తర్వాత ఆరేళ్ళకి గృహలక్ష్మిలో శారద లేఖలు ప్రారంభించినప్పుడు కూడా, ఈ శారద ఎవరా అని కొన్నాళ్ళు ఉక్కిరిబిక్కిరయ్యారు.

చెట్టు నీడ ముచ్చట్లు ఏవో ఊసుపోని కబుర్లు కావు. ఆ ముచ్చట్లలో ఎన్నో ముఖ్యమైన సంగతులు. మరెన్నో సామాజిక సమస్యలు-వాదములు-ప్రతివాదములు, చర్చలు, విమర్శలు-విశ్లేషణలు-ఇలా ఎంతో ఉత్కంఠగా సాగేవి ముచ్చట్లాడుకొనే అయిదుగురు మహిళలు, అయిదు విభిన్న ప్రాంతాలకి చెందినవారేమో, వారి వారి మాటలు, ఆయా ప్రాంతాలకి చెందిన యాసతో, ఆయా మాండలికాల్లో సాగేది. అంతా తెలుగే కాని రకరకాల పలుకుబళ్ళు-యాసలు-మాండలికాలు-ఇలా బహుముఖీనంగా రాయడానికి రచయిత్రికి, ఆయా మాండలికభేదాలు తెలిసి ఉండాలి. అందుకు ఎంతో ప్రజ్ఞ కావాలి, భాషాజ్ఞానం ఉండాలి, ప్రతిభా పాటవాలు అవసరం. ఇవన్నీ వరలక్ష్మమ్మగారికి ఉన్నాయి. అందుకే ఈ రచనా క్రీడని రసవత్తరంగా నిర్వహించారు

మా చెట్టు నీడ ముచ్చట్లలో ప్రస్తావించినవి, స్త్రీల సమస్యలూ, సాంఘికాచారాలూ, దేశ పరిస్థితులూ, ప్రాచీన ఆచారాలూ, నవ్య నాగరికతలూనూ. పాఠకుల్లో ఆలోచనల్ని రేకెత్తించి వారిని కర్తవ్యోన్ముఖుల్ని చెయ్యడమే ఈ ముచ్చట్లు రాయడంలో వరలక్ష్మమ్మగారి ఉద్దేశం. ఆమె ఏ రచన చేసినా ఏదో ఒక సామాజిక ప్రయోజనం కోసమే-అదే ఆమె లక్ష్యం. ఆ లక్ష్యం మా చెట్టు నీడ ముచ్చట్లలో కూడా ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ ముచ్చట్లే, తర్వాత ఆమె రాసిన శారద లేఖలకి ఓరకంగా ప్రాతిపదిక-ఈ ముచ్చట్లలో భావాలే, మరింత అందంగా రూపుదిద్దుకొని, బలాన్నీ జవాన్నీ పుంజుకొని, నిండైన కళారూపాలు దాల్చి శారద లేఖలుగా విలసిల్లాయి.

**ఇతర రచనలు :** కథలూ, లేఖలూ, ముచ్చట్లే కాకుండా, వరలక్ష్మమ్మ మరెన్నో ఇతర రచనలు కూడా చేశారు.

'వసుమతి' అనే సాంఘిక నవల రాశారు. తన పధ్నాల్గవ ఏట స్వయంగా విన్న ఒక అభాగ్యురాలి కన్నీటిగాథ అది ఆ నవలని మద్రాసు టెక్స్ట్‌బుక్ కమిటీవారు ఉన్నత పాఠశాలల్లో పఠనీయ గ్రంథంగా ఆమోదించారు.

స్వేచ్ఛాప్రణయము వలన కలిగే అనర్థాలని వెల్లడించే 'అపరాధి' అనే నాలుగు వందల పేజీల నవల రాశారుకాని, అది అసంపూర్ణంగానే ఉండిపోయింది. ముద్రణ కాలేదు.

కొన్ని నాటికలు రాశారు

వాటిలో ఒకటి, స్త్రీ సమస్యలు ఇతివృత్తంగా తీసికొని రాసిన 'మహిళా మహోదయము'.

తర్వాత రాసినది నాల్గవ శతాబ్దపు ఆంధ్రుల చరిత్రకి అద్దంపట్టే "పునఃప్రతిష్ఠ"

ఆంధ్ర వారపత్రికలో ప్రచురితమైన, కాలేజి విద్యార్థినుల అగచాట్లకి అద్దంపట్టే నాటిక మరొకూటి

గృహలక్ష్మి పత్రికలో ప్రచురించిన 'లేడీస్‌క్లబ్' ఇంకొక నాటిక. కొన్ని మహిళా సంస్థల తీరుతెన్నుల్ని విమర్శిస్తూ రాసిన రచన ఇది. 'రాధమొళ్ళి', 'జీవనరాగం' అనే రెండు మంచి నాటికలు ఆమె కలం నుండి వెలువడ్డాయి.

పిల్లలు ప్రదర్శించడానికి వీలుగా ఉండేలా ఎన్నో బాలనాటికలు రచించారు. 'జ్యోతి' అనే నాటిక, ఆరోగ్యశాఖవారి ఆమోదంపొంది, ఎన్నో ప్రదర్శనలకి నోచుకుంది.

ఆమె వ్రాసిన స్వగతాలలో రాణిమల్లమ్మ ప్రముఖమైనది.

వరలక్ష్మమ్మగారు కొందరు ప్రసిద్ధుల జీవితగాధల్ని సంగ్రహంగా రాశారు.

వీటిలో ముఖ్యమైనవి.

వెలగపూడి సరస్వతమ్మ జీవిత చరిత్ర-

ఉన్నవ లక్ష్మీభాయమ్మ, సింగరాజు నాగభూషణం, పొన్నాడ , రామనాధం, మహాత్మాగాంధీ, శ్రీమతి ఇందిరాగాంధీ, ఉన్నవ దంపతులు, కె.టి.యల్. నరసింహాచార్యులు, మొదలైన ప్రముఖుల జీవిత చరిత్రల్ని సంగ్రహంగా రాశారు వరలక్ష్మమ్మ

బాలల కోసం ఆమె రచించిన బాలనీతి కథావళి, పెద్దలకోసం ప్రౌఢశైలిలో రాసిన 'విశ్వామిత్ర మహర్షి' వరలక్ష్మమ్మగారికి కీర్తిని అర్జించి పెట్టాయి.

వరలక్ష్మమ్మ ప్రతిభ, కథలు, లేఖలు, వ్యాసాలు, నాటికలు వంటి వచన రచనలకే పరిమితం కాలేదు. ఆమె రచయిత్రి మాత్రమే కాదు, కవయిత్రి కూడా.

ఆమె ఎన్నో పద్యాలు రాశారు. కవితలల్లారు. విశ్వనాథ, జాషువా వంటి అగ్రశ్రేణి కవులతో కలిసి కవితా గోష్ఠులలో పాల్గొన్నారు. రేడియో ప్రసంగాలు చేశారు

నవ భారతేతిహాసం అనే నవ్యపురాణం రచించారు గాంధీ దండకం రాశారు.

దేశభక్తిని రగిలించే గేయాలూ పాటలూ రాశారు. కవితలల్లారు-వాటిలో కొన్ని -

ఇష్టదైవము

నిత్యమంగళ ప్రభువు

వెంకటేశ్వర స్తుతి

గుజ్జువేలుపు

భరతమాత వందనము

భరతమాత ప్రశంస

ఆంధ్రమాత వందనము

స్వాతంత్ర్యోత్సవము

నమో ఆంధ్రమాత

బ్రహ్మంగారి తత్వము

జేజేలు

ప్రొద్దుపొడుపు

సందెవెలుగు

రామచిలుక

చిన్నవాడు

మాకోడె

పెండ్లిబేరము

**రేడియో ప్రసంగాలు :** వరలక్ష్మమ్మగారు, అప్పట్లో ఆంధ్రులతో సహా దాక్షిణాత్యులందరికీ ఒకే రేడియో స్టేషన్‌గా ఉన్న మద్రాసు రేడియో స్టేషన్‌లో, ఆ స్టేషన్ ప్రారంభమైన కొద్దిరోజులకే, స్త్రీలు-పత్రికారచన అనే విషయం పై రేడియో ప్రసంగం చేశారు. ఆ తర్వాత పదేళ్ళు మద్రాసు రేడియో స్టేషన్‌లో ఎన్నో ప్రసంగాలలోనూ కవితాగోష్ఠులలోనూ, ఒకటిరెండుసార్లు హైదరాబాదు రేడియోలోనూ ఆమె ప్రసంగించారు.

వరలక్ష్మమ్మ రేడియో కార్యక్రమాల్లో రెండు ఘట్టాలు మరువలేనివి.

ఒకటి 1947 ఆగష్టు 16వ తేదిన మద్రాసు రేడియో స్టేషన్‌వారు నిర్వహించిన స్వాతంత్ర్య అవతరణ కవితాగోష్ఠిలో పాల్గొనడం.

రెండు, 1956 నవంబరు 1వ తేదిన ఆంధ్ర ప్రదేశ్ అవతరణ సందర్భంలో విజయవాడ

రేడియో స్టేషన్‌వారు ఏర్పాటు చేసిన కవితా గోష్ఠిలో పాల్గొనడం

రెండు కవితా గోష్ఠుల్లోనూ విశ్వనాధ సత్యనారాయణ, పుట్టపర్తి నారాయణాచార్యులు, తుమ్మల సీతారామమూర్తి, జాషువా, కాటూరి వంటి మహాకవులతో సరిసమానంగా సమాన స్థాయిలో పాల్గొనడం ఒక విశేషం అయితే, ఆ రెండు గోష్ఠులలోనూ ఒకే ఒక వనితకి అవకాశం లభించడం, ఆ ఒక్క అవకాశం రెండుమార్లూ వరలక్ష్మమ్మగారినే వరించడం మరో విశేషం సాహిత్య ప్రపంచంలో ఆమెకి గల, గౌరవ ప్రతిష్ఠలకీ, స్థాయికీ, సామర్థ్యానికీ అవి రెండూ నిదర్శనాలు. ఆ సందర్భంలో ఆమె చదివిన పద్యాల్ని విశ్వనాథవంటి హేమాహేమీలు మెచ్చుకున్నారు.

వరలక్ష్మమ్మ వాఙ్మయ సేవా విశేషాలకి ముగింపు వాక్యాలు పలికే ముందు రెండు మాటలు.

వీరేశలింగంపంతులు వంటి మహామహుల జీవితాల్నీ, వారి సాహిత్య సేవనీ, సంస్కరణోద్యమాన్నీ చూసి ప్రభావితురాలై, తనచుట్టూ ఉన్న సంఘంలోజరుగుతూన్న అన్యాయాల్నీ, అక్రమాల్నీ, అధర్మాన్నీ చూసి స్పందించి, సమాజాన్ని ముఖ్యంగా నాటి స్త్రీలని చైతన్యవంతం చెయ్యడానికి ఆమె కలంపట్టారు. కథలు రాసినా, వ్యాసాలు రచించినా, నాటికలు రాసినా, కవితలల్లినా ఆమె ధ్యేయం ఒక్కటే! ధార్మిక జీవనాన్ని ప్రబోధించడం-నైతిక విలువల్ని ప్రస్తావించడం, స్త్రీల అభ్యుదయ జీవనావసరాన్ని ప్రచారం చెయ్యడం.

అంతే కాదు-కులస్త్రీలు బయట స్వేచ్ఛగా నడవడానికే లక్ష అడ్డంకులున్న ఆ రోజుల్లో నిర్భయంగా తన రచనలద్వారా ప్రసంగాల ద్వారా, స్త్రీ హితైషిణీ కార్యక్రమాల ద్వారా, తన అభిప్రాయాల్ని వెల్లడించి, తన తర్వాత కలం పట్టిన ఎందరో రచయిత్రులకు మార్గదర్శకురాలయారు. తనతోబాటు రచనలు ప్రారంభించిన స్త్రీలు కొందరు లేకపోలేదు; చావలి బంగారమ్మ, పాణకా కనకమ్మ, స్థానాపతి రుక్మిణమ్మ, కాంచనపల్లి కనకాంబ, గుడిపూడి ఇందుమతీదేవి వంటివారు

కాని వరలక్ష్మమ్మగారిది వారందరికంటే భిన్నమైన మార్గం-మనస్సులోని భావాలకి రూపకల్పన చెయ్యడంతో మధురమైన కవితలల్లడంతో, పరిమితమైన రచనలు చెయ్యడంతో, వారంతా ఊరుకుంటే వరలక్ష్మమ్మగారు మాత్రం సమాజం పట్ల ఒక గురుతరమైన బాధ్యతని స్వీకరించి, సామాజికుల్లో ముఖ్యంగా స్త్రీలలో చైతన్యం తీసుకువచ్చి, వారిలో విద్యాసక్తినీ, అన్యాయాన్ని ఎదుర్కొనే శక్తినీ, రచన చెయ్యడం పట్ల ఆసక్తినీ

పెంపొందించారు. మరో విషయం తమ సమకాలీన రచయిత్రులు ఎక్కువగా పద్యాలూ పాటలూ వ్రాశారు. ఈమె అలాకాదు, ప్రజలందరికీ చేరువగా ఉండే వచనంలో కథలూ, వ్యాసాలూ పాటలూ వ్రాశారు. ఆ వచనాన్ని కూడా సులభమైన శైలిలో రాశారు ఒకరకంగా చెప్పాలంటే ఇరవయ్యవశతాబ్ది ఉత్తరార్ధంలో కథానికా రచయిత్రులకీ నవలాకారిణులకీ ఆమెయే ఆదర్శమూర్తి. 1950 తర్వాత రచయిత్రులలో చైతన్యజ్యోతి ఉదీయమానం కావడానికీ ప్రజ్వలంగా ప్రకాశించడానికీ ఆమె ముఖ్యకారకురాలు.

# సామాజిక సేవ

## ప్రారంభం :

వరలక్ష్మమ్మ చేసిన సామాజిక సేవ నిరుపమానమైంది. తన అసంఖ్యాకమైన రచనలద్వారా సామాజిక చైతన్యాన్ని తీసుకువచ్చారు. నిత్యజీవితంలో కూడా ఎన్నో సామాజిక కార్యక్రమాల్లో పాల్గొని, ఉద్యమాలు నిర్వహించి, మహిళా సంఘాలు నెలకొల్పి, స్త్రీవిద్యాప్రణాళికలు ఏర్పరచి, తన జీవితంలో ఎక్కువ భాగం సాంఘిక సేవకి వినియోగించారు.

ఒకమారు కొటికలపూడి సీతమ్మగారనే విదుషీమణి, బాపట్లలో స్త్రీ విద్యావశ్యకతని గురించి ఉపన్యసించారు. అప్పటికి చిన్న బాలికగా ఉన్న వరలక్ష్మమ్మ తన తల్లిగారితో కలిసి వెళ్ళి ఆ ఉపన్యాసం విన్నారు. అది ఆమె మనస్సులో ముద్రవేసుకుంది. తాను కూడా చదువుకోవాలనీ, ఆ తర్వాత సామాజిక సేవ చేస్తూ, స్త్రీ జనాభ్యుదయానికీ స్త్రీ విద్యావ్యాప్తికీ కృషి చెయ్యాలనీ నిశ్చయించుకొన్నారు. ఆ విధముగా మొదట తాను గ్రంధములు పఠించీ, మద్రాసులో జరిగే విజ్ఞాన చంద్రికా పరిషత్పరీక్షలు వ్రాసీ, ముందు తాను విద్యావిజ్ఞానాల్ని సంపాదించుకొన్నారు. ఆ పరీక్షల్లో ఉత్తీర్ణులైన వారిలో వరలక్ష్మమ్మగారితోబాటు కాంచనపల్లి కనకాంబ, అదుర్తి భాస్కరమ్మగారలు కూడా ఉన్నారు. అంతే కాకుండా మచిలీపట్నం వారి భక్తిసంబంధమైన పరీక్షలు వ్రాసి ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణులై, తమ భాషా పాటవాన్ని పెంచుకొన్నారు చోరగుడి సీతమ్మగారి యువతీవిద్యాలయంలో చాత్రాతి లక్ష్మి

నరసమ్మగారి యొద్ద, శబ్దమంజరి, రఘువంశము, మనుచరిత్రాది ప్రబంధాలూ చదివి తన భాషా సామర్థ్యాన్ని ఇనుమడించుకొన్నారు.

ఆ విధముగా విద్యావిజ్ఞానములు, ముందుగా తను సంపాదించి, తాను నేర్చిన విద్యనీ, తన ఆలోచనల్నీ, తక్కిన స్త్రీలకి అందించాలనే ఆశయంతో, భర్త ఉద్యోగరీత్యా, మదనపల్లె వెళ్ళినప్పుడు, అక్కడ కొందరు స్త్రీలను చేర్చి వారికి విద్యావివేకాలు లభించేలా వారంవారం తాను, ఉపయుక్తమైన ఉపన్యాసాలు ఇచ్చి, సామాజిక సేవకి శ్రీకారం చుట్టారు. అంతకు ముందే, గుంటూరులో తన అన్నగారైన పాలపర్తి రామమూర్తిగారు స్థాపించిన వనితాగ్రంథ మండలికి ఉచిత సేవలు అందించి, అక్కడి జమాఖర్చులు నిర్వహిస్తూ, గ్రంథాల్ని ఎంచి, వనితలకి ఇచ్చి చదివించి, వారి అభ్యున్నతికి పాటుబడుతూ కొంత కృషిచేశారు.

సేవా దృక్పథం అనేది ఉండాలేకాని, ఆడంబరంగానే చెయ్యక్కర్లేదు సేవ. తోటి వారికి చిన్న సాయం చెయ్యడం కూడా సేవే అనిపించుకుంటుంది. ఆ పని వరలక్ష్మమ్మ తాను మూడవక్లాసు చదువుకొనే రోజుల్లోనే చేశారు. తమ ఇంటి ప్రక్కన ఒక గోల్కొండ వ్యాపారుల కుటుంబం ఉండేది. ఆ యింట్లో ఆరుగురు చదువురాని ముసలమ్మలు ఉండేవారు. వారికి తమ ప్రాంతాలనుండి జాబులు వచ్చేవి- జాబులకి జవాబులు వెళ్ళాలి. ఆ అవ్వలకి జాబులు చదివి పెట్టి, వాళ్ళు ఏదో సోదెలా చెప్పుకుపోయే మాటల్ని ఒక క్రమబద్ధం చేసి, ఆ సారాంశాన్ని జవాబులుగా తీర్చి, ఆ జవాబుల్ని కార్డులమీద ఆ చదువురాని ముసలివాళ్ళకి రాసి పెట్టి, ఆ వయసుకి తగ్గ సేవ ఆ వయసులో చేశారు వరలక్ష్మమ్మ. అలా చేసిన సేవ ఆమెకి ఉపకరించింది కూడా, ఆసక్తికరంగా లేఖలు రాసే నేర్పు వచ్చింది కనుక, ఆ నేర్పరితనాన్ని ఉపయోగించి, ఆ తర్వాత రోజుల్లో ఆమె గృహలక్ష్మి పత్రికలో, ఆరు సంవత్సరాలు ధారావాహికంగా, ఆంధ్ర పాఠకుల్ని ఉర్రూతలూగించిన శారద లేఖలు రాశారు.

బెజవాడలో జరిగిన ఆంధ్ర మహిళా సభలో, బాల్య వివాహాల నిషేధానికి సంబంధించిన శారదా బిల్లు పై ప్రసంగించారు. మర్నాడు రామమోహన గ్రంథాలయంలో ఏర్పాటైన స్త్రీల సభకి అధ్యక్షత వహించారు. బందరులో జరిగిన మూడవ ఆంధ్ర మహిళా సభ చాలా పెద్దది. దానికి 11 జిల్లాల నుంచి ఎందరో మహిళా ప్రతినిధులు వచ్చారు. ఆ సభలో విడాకుల చట్టము గురించి ప్రసంగాలు సాగాయి. వరలక్ష్మమ్మగారి ప్రసంగం, ఎందర్నో మంత్రముగ్ధుల్ని చేసింది. ఎందరి ప్రశంసల్నో చూరగొంది.

రాష్ట్ర మహిళా సభలకి లభించిన ప్రోత్సాహంతో, ఎన్నో జిల్లాల్లోనూ, తాలూకాల్లోనూ మహిళా సభలు ఏర్పాటు కాజొచ్చాయి. ఆ సభానిర్వాహకుల్లో చాలా మంది వరలక్ష్మమ్మని

ఆహ్వానించి తమ సభల్లో ఉపన్యసించవలసిందిగా కోరేవారు. ఆంధ్రదేశములో మహిళా చైతన్యానికి నడుం బిగించిన కందుకూరి వీరేశలింగంగారినుండి, ఉత్తరభారతంలో స్త్రీజనోద్ధారకుడైన రాజారామమోహన్‌రాయ్ వరకూ, ఎందరెందరో మహామహుల కృషిని ప్రస్తుతిస్తూ, మహిళాభ్యుదయ అవశ్యకతని గురించి ఆమె ఎన్నో ఉపన్యాసాలిచ్చారు. శ్రోతల్ని ఉత్తేజపరచడంకోసం మహిళా ప్రబోధము అనే బుర్రకథని, వినిపించారు. కొందరి చేత పాడించారు.

ఉపన్యాసముల ద్వారా మహిళల్లో చైతన్యం రగిలించడంతో తన సామాజిక సేవ ముగిసిపోవడం వరలక్ష్మమ్మకి ఇష్టంలేదు-అది ఆమె మనస్సుకి సరిపోలేదు-ఏదో ఒక సంస్థనో, సమాజాన్నో, మండలినో స్థాపించి దాని ద్వారా, ఒక నిర్దిష్ట రూపంలో మహిళలకి సేవ చేయాలనే కోరిక ఆమెలో రానురాను బలపడసాగింది. కొన్ని ఏండ్లక్రితం శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు రాజమండ్రిలో హితకారిణీ సమాజం స్థాపించి, సమాజానికి, ముఖ్యంగా నిస్సహాయులైన మహిళలకి, ఎంతో సహాయం చేశారు. అలాంటి సమాజాన్నొకదానిని, తాను బాపట్లలో ప్రారంభిస్తే?

ఈ ఆలోచన రాగానే, వెంటనే ఆమె అందుకు కృషి ప్రారంభించారు. కొందరు స్నేహితురాండ్రతో సంప్రదించారు. బాపట్ల, ప్రాచీన సాంప్రదాయవాదులకి అటుపట్టు-అలాంటి పట్టణంలో స్త్రీలు తమకోసం ఒక సంఘాన్ని స్థాపించుకోవడం, అక్కడ నలుగురు ఆడవాళ్ళూ సమావేశం అవుతూ, తమ సమస్యల్ని చర్చించుకోవడం, ఇదంతా జరిగే పనేనా? ధైర్యంగా స్త్రీలు వస్తారా? సమాజంలో సభ్యులుగా చేరతారా? ఇదొక దీర్ఘకాలిక ఆలోచన, సందేహం.

ఏమైతేనేం? ఒక నిర్ణయానికి వచ్చి, ధైర్యంగా, రంగంలోకి దిగారు వరలక్ష్మమ్మ. కొందరు స్త్రీలు ఆమెకి బాసటగా నిలిచారు.

## స్త్రీహితైషిణీ మండలి :

వరలక్ష్మమ్మ పట్టుదల, వజ్రసంకల్పం, కార్యనిర్వహణాదక్షత, పదిమందినీ ఒప్పించి తనతో కలుపుకొనిపోయే నేర్పు, అన్నింటికంటే ఒక మంచిపనిని చెయ్యబోతున్నాం. మంచికి విజయం తథ్యం అనే నమ్మకం-వీటి అన్నింటి ఫలితంగా 1931లో బాపట్లలో బొలిసెట్టి ఆదినారాయణ శ్రేష్ఠిగారి మేడమీద స్త్రీహితైషిణీ మండలి ప్రారంభం అయింది.

వావిల కొలను పద్మాసనమ్మగారు ప్రారంభోత్సవం చేశారు. ఒక కార్యవర్గం ఏర్పాటయింది. ఆ కార్యవర్గంలోని సభ్యులు -

కార్యదర్శి-కనుపర్తి వరలక్ష్మమ్మ

సహాయ కార్యదర్శి-గండవరపు సావిత్రమ్మ

కార్య నిర్వాహక సభ్యులు-పంగులూరి రాజ్యలక్ష్మమ్మ
బొలిసెట్టి శాంతవతమ్మ
టి. కమలాంబ
గంగరాజు లక్ష్మీనరసమ్మ
చోరగుడి మంగమ్మ
పాలపర్తి తామ్రపర్ణి.

ఇలా తొమ్మండు గురు కార్యవర్గ సభ్యులతో, తమ పట్టణంలో, స్త్రీహితైషిణీ మండలి అనే పేరుతో ఒక మహిళా సంస్థ ప్రారంభమైందని తెలిసి, బాపట్ల పురజనులు ఆశ్చర్యపోయారు-సనాతనులు, ఛాందసవాదులు, హుంకరించారు, చర్చించారు. ఇంట్లో పడి ఉండవలసిన ఆడవాళ్ళు, సంస్థలూ, మండలులూ స్థాపించడమా? వీధికెక్కడమా? వీల్లేదు-అంటూ గర్జించారు. ఊళ్ళో అలజడి సృష్టించారు. ఆ అలజడిని ప్రత్యక్షంగా ఎదుర్కోలేక పోయినా, నవీన భావాలున్న ఇతరులు, ముఖ్యంగా యువకులూ యువతులూ ఎంతో ఆనందించారు.

ఛాందసవాదులు సృష్టించిన అలజడికి వరలక్ష్మమ్మ, ఆమె మిత్రులూ భయపడలేదు-ధైర్యంతో పట్టుదలగా స్త్రీహితైషిణీ మండలి కార్యక్రమాల్ని సమధికోత్సాహంతో నిర్వహించసాగారు

వారం వారం రామాయణ భారత భాగవతాది గ్రంధపఠనం, పత్రికా పఠనం, వీటికి తోడు చిన్న చిన్న సమావేశాలు, సభలు, చర్చలు, ఇష్టాగోష్ఠులు, బాల బాలికల కొరకు వినోద కార్యక్రమాలు-ఇలా హితైషిణీ మండలి విద్యావిజ్ఞాన కేంద్రంగా విలసిల్లసాగింది. ఇవికాక, కుట్లు, అల్లికలు, గృహపరిశ్రమలు వంటి ఉపయోగ కృత్యములకు కూడా అటపట్టయింది స్త్రీహితైషిణీ మండలి

ఈలోగా హితైషిణీ మండలికి కొన్ని సమస్యలు ఎదురయ్యాయి.

కనుపర్తి వరలక్ష్మమ్మ, రచయిత్రీ సంఘసేవకురాలు మాత్రమే కాదు, దేశభక్తి పరాయణురాలు కూడా. స్వాతంత్ర్యోద్యమం అన్నా, గాంధీగారన్నా ఆమెకి అమిత గౌరవం ఆ మహోద్యమంలో తాను కూడా, సర్వాత్మనా పాల్గొనాలని ఆకాంక్ష. అందువల్ల మండలిలో రాట్నము వడకటం, దేశభక్తి గేయాలు ఆలపించడం జరిగేది. దేశంలో

సహాయనిరాకరణోద్యమం ఒక ప్రభంజనంలా సాగుతూన్న రోజులేమో, ఆ ఉద్యమ ఛాయలు ఎక్కడ కనిపించినా, నాటి ఆంగ్లప్రభుత్వం సహించడంలేదు రాట్నం చప్పుడైతే చాలు, ఖద్దరు బట్టలు కట్టిన వ్యక్తి కనిపిస్తేచాలు, దేశభక్తి గేయం వినిపిస్తే చాలు, ఆ యింటిమీదా ఆ ఇంటి యజమానిమీదా, నిఘా వేసి, అవకాశం దొరికితే చాలు, ప్రభుత్వ ధిక్కరణ నేరం మోపి శిక్షించేవారు

స్త్రీహితైషిణీ మండలిలో నిత్యమూ జరిగే కార్యకలాపాలు అవే-వరలక్ష్మమ్మగారు నిర్భయంగా ఖద్దరు కట్టేవారు. అంతే కాదు నిత్యమూ మండలిలో సత్యాగ్రహము, సహాయ నిరాకరణము, గాంధీగారి ప్రచార ప్రబోధములు, వంటి అనేకానేక విషయముల గురించి చర్చలూ గోష్ఠులూ సాగేవి పత్రికల్లో వచ్చే స్వాతంత్ర్యోద్యమ వార్తలు చదవడం. వాటిపై చర్చలు చెయ్యడం-హితైషిణీ మండలి, సాహిత్య, సాంఘికాలతోబాటు, రాజకీయ కార్యక్రమాల వేదికగా కూడా తయారైంది.

ఇదంతా తెలిసి ప్రభుత్వం ఏం చర్య తీసుకుంటుందో మండలి మీద? అటువంటి మండలికి ఇల్లు ఇచ్చినందుకు తననెక్కడ శిక్షిస్తుందో అని భయపడి, ఆ యింటి యజమాని, తన ఇంట్లోంచి స్త్రీహితైషిణీ మండలివారిని కాళీచేయించాడు.

అతనికి ఏ భయం వచ్చిందో, అదే భయం అందరికీను. ఎవరూ ఓపట్టాన, స్త్రీహితైషిణీ మండలి అంటే ఇల్లు అద్దెకి ఇచ్చేవారు కాదు. ఇచ్చినా, నెలకో రెండు నెలలకో కాళీచేయ్యమనేవారు. ఆ విధంగా స్త్రీహితైషిణీ మండలికి స్థిరమైన కార్యాలయ స్థానం, పదకొండు సంవత్సరాల వరకూ, అనగా స్వంతభవనం ఏర్పడేవరకూ, కుదరనేలేదు-ఆ పదకొండేళ్ళూ, హితైషిణీ మండలిని, తరుచు ఓ ఇంటినుంచి మరో ఇంటికి మారుస్తూనే ఉన్నారు వరలక్ష్మమ్మ

మండలిలో ఎన్నో విజ్ఞానదాయకమైన కార్యక్రమాలూ, స్త్రీలకి జ్ఞానార్జనతో బాటు, ధనార్జనకి కూడా ఉపయోగపడే బట్టలు కుట్టడం, లేసులు అల్లడం, వివిధ గృహోపకరణాల్ని తయారు చేయడం వంటి సాంకేతిక విద్యల్ని నేర్పడం, శిక్షణ ఇవ్వడం, జరుగుతూ ఉన్నా, స్త్రీలెవ్వరూ రాజ వీధిన బడి వచ్చేవారు కాదు. ఆ సందుల్లోంచీ ఈ సందుల్లోంచీ, రహస్యంగా వచ్చేవారు. ఎవరైనా చూస్తే ''ఈమె మహిళా మండలికి వెళ్తోంది''ని ఆక్షేపిస్తారని భయం. అలా ఉండేవి ఆ రోజులు.

మహిళా సమాజాలకి స్త్రీలు వెళితే, ఇంకవారు తెలివి మీరి, తమ చెప్పుచేతల్లో ఉండరని మగవారి భయం. అంతగా ఉండేది ఆకాలంలో-అయినా కొందరు స్త్రీలు స్త్రీహితైషిణీ మండలికి వచ్చి, అక్కడి గ్రంథాలూ పత్రికలూ చదివి, కుట్లూ అల్లికలూ నేర్చుకొని, విజ్ఞాన విషయికమైన చర్చల్లో పాల్గొని, తమ జ్ఞానాన్నీ ఆర్థిక స్థితినీ మెరుగు పరచుకొనేవారు తల్లులు

మండలికి వెళుతూ ఉంటే వారితో పిల్లలు కూడా వచ్చేవారు. అలా వచ్చే బాలబాలికలకోసం, వరలక్ష్మమ్మ ఆటల పోటీల్నీ. విజ్ఞాన వినోద కార్యక్రమాల్నీ ఏర్పాటు చేసేవారు. వాళ్ళంతా పాల్గొనే నిమిత్తం ఎన్నో పిల్లల నాటికల్నీ, పాటల్నీ, బుర్రకథల్నీ రాసేవారు. పోటీలు నిర్వహించి బహుమతులిచ్చి వాళ్ళని ప్రోత్సహించేవారు.

వారిలో విద్యావిజ్ఞానాలు పెరిగితే కాని స్త్రీజనాభ్యుదయం సాధ్యం కాదు. జ్ఞానం పెరగాలంటే మంచి పుస్తకాలు చదవాలి. మండలికి వచ్చే స్త్రీలకి పుస్తకాలు ఇచ్చి చదివిద్దాం అంటే, మండలికి మంచి గ్రంథాలయం లేదు. ఈ కొరతని గమనించి, వరలక్ష్మమ్మ గ్రంథసేకరణ కార్యక్రమాన్ని చేపట్టారు. గుంటూరులో మహిళల కోసం తమ పెద్ద అన్నగారైన పాలపర్తి రామమూర్తిగారు ప్రారంభించి కొన్నాళ్ళు నిర్వహించిన, వనితా గ్రంథ మండలి కాలాంతరమున మూతబడింది. ఆ గ్రంథ మండలి తాలూకు ఆరు వందల గ్రంథాల్నీ, తమ తల్లి గారైన హనుమాయమ్మగారి పేరున బహుమానంగా స్వీకరించి, వరలక్ష్మమ్మ, స్త్రీహితైషిణీ మండలిలో ఒక గ్రంథాలయాన్ని ప్రారంభించారు.

పత్రికా ప్రకటనలూ, ప్రత్యేక అభ్యర్థనలూ చేయగా, ఎందరో వదాన్యులు, అనేకానేక గ్రంథాల్నీ స్త్రీహితైషిణీ మండలి గ్రంథాలయానికి దానం చేశారు. కొన్నాళ్ళకి గ్రంథాలయం వందలాది మంచి మంచి పుస్తకాలతో నిండి పెద్దదిగా ఆయింది. తనకి చిన్నతనంలో విద్యావసరాన్ని ప్రబోధించి, తర్వాత తాను విద్యాభ్యాసం చేసి విజ్ఞాన సముపార్జన చెయ్యడానికి కారకురాలైన చోరగుడి సీతమ్మగారి పట్ల ప్రత్యేక కృతజ్ఞత, గౌరవాలు ప్రదర్శిస్తూ ఆ గ్రంథాలయానికి వరలక్ష్మమ్మ 'సీతాపుస్తకసదనము' అని పేరు పెట్టారు.

స్త్రీహితైషిణీ మండలి ద్వారా, వరలక్ష్మమ్మ స్త్రీలకి అందించిన సేవలు అపారము.

కొందరికి హిందీ నేర్పించారు.

కొందరికి సంగీతము

మరి కొందరికి కుట్లూ, అల్లికలూ, నూలు వడకడం, గృహోపకరణాలు తయారు చెయ్యడం-ఇలా రకరకాల విద్యలు నేర్పించి, నేర్పిన ఆ విద్యల ద్వారా వాళ్ళంతా, రకరకాల ఉపాధులేర్పరచుకోడానికి సాయం చేశారు.

అంతేకాదు,

స్త్రీలకి ఓటు హక్కు రాగానే, ఓటు ప్రాధాన్యత ఎంతటిదో తెలియజెప్పి, ఇంటింటికీ తిరిగి, స్త్రీలని ఓటర్లుగా నమోదు చేయించి, వారంతా ఎన్నికల్లో తమ ఓట్లు వెయ్యాలనీ, సరిఅయిన అభ్యర్థిని ఎన్నుకోడానికి, తమ ఓట్లు బలమైన సాధనాలనీ ప్రచారం చేశారు. వారిలో రాజకీయ చైతన్యాన్ని కలిగించారు.

ఒకమారు బీహారు భూకంప బాధితులకీ,
మరోమారు బెంగాలు క్షామ పీడితులకీ,
ఇంకోమారు వరదలవల్ల నిర్వాసితులైనవారికీ,
స్త్రీహితైషిణీ మండలి తరపున, ధనాన్నీ వస్త్రాల్నీ పంపి ఆదుకున్నారు.

స్త్రీహితైషిణీ మండలి కార్యక్రమాలు సేవాకార్యక్రమాలకి మాత్రమే పరిమితము కాదు మండలిని వరలక్ష్మమ్మ ఒక సాంస్కృతిక కేంద్రంగా కూడా రూపుదిద్దారు

మండలి తరపున ఒకమారు, అప్పటి అఖిలభారత కాంగ్రెస్ ప్రెసిడెంట్ అయిన బాబూ రాజేంద్రప్రసాద్‌ని సత్కరించారు. మరొకమారు దేశోద్ధారక నాగేశ్వర రావు గారిని సన్మానించారు. ఇంకొకమారు అప్పటి ఆస్థానకవి అయిన శ్రీపాద కృష్ణమూర్తిగారినీ, వేరొకమారు కూర్తాళం స్వాముల వారినీ, మరో పర్యాయం సాహితీసమితి సభాపతులైన తల్లావర్ఝుల శివశంకరస్వామి వారినీ, సన్మానించి, గౌరవించారు.

1934లో స్త్రీహితైషిణీ మండలిని, సంస్థల చట్టాన్ని అనుసరించి రిజిష్టర్ చేయించి, స్వంత భవన నిర్మాణము నిమిత్తం, తమ మండలికి కొంత స్థలాన్ని బాపట్ల పట్టణంలో ఉచితంగా ఇప్పించవలసిందిగా వరలక్ష్మమ్మ గుంటూరు జిల్లా బోర్డు వారిని అభ్యర్థించారు.

అప్పటి జిల్లా బోర్డు అధ్యక్షులైన జాగర్లమూడి కుప్పస్వామి చౌదరిగారు, ఆమె అభ్యర్థనని మన్నించి సుమారు వేయిగజముల స్థలాన్ని మండలికి ఉచితంగా ఇచ్చారు. ఆ స్థలంలో స్వంత భవనం నిర్మించడం తలకి మించిన భారం అయింది వరలక్ష్మమ్మగారికి.

ఏమంటే, మండలికి ఆదాయం లేదు. సభ్యత్వ రుసుము ద్వారా వచ్చేది నెలకి పది రూపాయలు. ఆ చిన్నమొత్తంలో ఖర్చులు పోను మిగిలేది ఎంత? అయినా వరలక్ష్మమ్మ పదేళ్ళలో పొదుపుగా ఖర్చులు పెట్టి అయిదువందల రూపాయల వరకు మిగిల్చారు కాని భవన నిర్మాణానికి ఆ ధనం సరిపోదు. దాతలెవరైనా ఆదుకోవాలి. ధనికులున్నంతగా ఈ లోకంలో దాతలుండరు. ఆ ధనికుల వెంటపడి అడిగి బ్రతిమాలి, పీడించి, చందాలు వసూలు చెయ్యాలి. అందుకెంతో ఓర్పూనేర్పూ కావాలి. వరలక్ష్మమ్మగారికి ఓర్పయితే ఉందికాని, 'నేను దానధర్మాలు చెయ్యను' అనే వ్యక్తి చేత దానం చేయించే నేర్పులేదు.

అయినా కష్టపడి విరాళాలు సేకరించారు.
గృహలక్ష్మి పత్రికాధిపతి కె.యన్. కేసరిగారు రూ. 100/- ఇచ్చారు
రాజా విక్రమ దేవవర్మగారు రూ. 100/-
చల్లపల్లి రాజాగారు రూ. 100/-

జిల్లాబోర్డు అధ్యక్షులైన కుప్పుస్వామిగారు రూ.50/-

వరలక్ష్మమ్మ ఇంటింటికి తిరిగి సంపాదించింది రూ. 1000/-.

ఇదంతా కలిపినా రెండు వేలు మించలేదు స్వంతభవన నిర్మాణానికి ఇంకా ఎంతో ధనం అవసరం. చందాలూ, విరాళాలూ సేకరించాలి.

అలా సేకరించడంలో వరలక్ష్మమ్మగారికి, ఆమె మూడవ అన్నగారైన భావనారాయణగారూ, రాజమండ్రి నాళం వారి ఆడబడచూ, బాపట్ల ఊటుకూరి వారికోడలూ, అంతకు మించి ప్రసిద్ధ సాహితీమూర్తి, ఉపన్యాసకురాలూ, అయిన శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, ఆమె భర్త హయగ్రీవ గుప్తగారలు, ఎంతో బాసటగా నిలిచి సహాయం చేశారు.

కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, బెజవాడ, గుంటూరు, చీరాల, కారంచేడు మున్నగు పట్టణాలకీ గ్రామాలకీ వెళ్ళి విరాళాలు పోగుచెయ్యగా పోగు చెయ్యగా భవన నిర్మాణానికి సరిపడా ధనం సమకూరింది.

చివరికి స్త్రీహితైషిణీ మండలికి స్వంత భవనం ఏర్పడింది.

భవన ప్రవేశ ఉత్సవం 1942వ సంవత్సరం సెప్టెంబరు 3వ తేదీన జరిగింది.

వరలక్ష్మమ్మకి ఒక పుత్రుడు జన్మించి చనిపోయాడు తర్వాత తన మేనకోడలైన సంకా భానుమతిని పెంచి పెద్ద చేసి తన ఆస్తికి వారసురాలిని చేశారు. అయినా ఆమె సంతాన హీనేకదా.

కాని స్త్రీహితైషిణీ మండలిని ఆమె తన పుత్రికగానే భావించారు. బైటకు రావడానికే మహిళలు జంకుతున్న రోజుల్లో, వారి అభ్యుదయం కొరకు మండలిని స్థాపించి, నెమ్మది నెమ్మదిగా వారిలోని భయ సంకోచాలను పోగొట్టి బాపట్లలోని చాలామంది స్త్రీలని మండలి సభ్యులుగా చేర్చి, నిత్యమూ వారు మండలికి వచ్చేలా ఉత్సాహపరిచారు. అలా మహిళల్ని చేరదీసి, వారి వారి సమస్యల్ని చర్చల ద్వారా, తదుపరి ఉచితమైన చర్యల ద్వారా పరిష్కరించుకొనేలా ప్రోత్సాహించారు. స్త్రీలు విద్యా విజ్ఞానాలు సంపాదించుకొని తమ వ్యక్తిత్వాల్ని పెంపొందించుకోవాలి అన్నదే వరలక్ష్మమ్మ తపన. అందుకే స్త్రీహితైషిణీ మండలిని స్థాపించి, దాదాపు నాలుగు దశాబ్దాలు, అంటే తనకి వృద్ధాప్యం వచ్చి, ఒంట్లో ఓపిక తగ్గేవరకు, దానిని సమర్ధంగా నిర్వహించి, తన అనంతరం కూడా ఆ సంస్థ, నిరంతరంగా కొనసాగాలనే ఆకాంక్షలో, మలితరం వారైన మల్లాది సుబ్బమ్మ, కోటంరాజు సీతాబాయి, కోన విజయలక్ష్మి వంటి ఉత్సాహవంతులకి స్త్రీహితైషిణీ నిర్వహణ బాధ్యతలు అప్పగించారు

మహిళా చైతన్యానికి కనుపర్తి వరలక్ష్మమ్మ చేసిన కృషి మరువలేనిది. సమాజానికి ముఖ్యంగా మహిళలకు, ఆమె అందించిన ప్రోత్సాహ ప్రోద్బలాలకి కృతజ్ఞతా సూచకంగా బాపట్ల మహిళలు ఆమెను 1952 అక్టోబరు 1వ తేదీన సముచిత రీతిలో సత్కరించారు. పురపాలక సంఘమువారు కూడా 5-4-1953న ఆమెకు పౌరసన్మానం చేసి తమని తాము గౌరవించుకున్నారు.

సామాజిక సేవలో ఉండే కష్టనిష్ఠురాల్ని వరలక్ష్మమ్మ ఈ పద్యంలో చెప్పారు.

పూలమాలలనిచ్చి పూజింపరెవ్వరు
కాని మాటలు పడి కలగవలయు
తోడు తోడుగ వచ్చి తోడ్పడరెవ్వరు
నొంటి పాటుకు నోర్చి యుండవలయు
బహుళ ధనమున సంభావింప రెవ్వరు
కడుపేదతమున నడలవలయు
ఒకచోట నుండంగ నొప్పుకోరెవ్వరు
నూరూరు తిరుగుచు నుండవలయు
సేవయన నిట్లు సుఖమైన త్రోవగాక
భీకరోదగ్రకంటకావృతముగాన
నైహికసుఖసంపదల పై నాశవదలి
చేయవలయును నిజసంఘ సేవనెపుడు

ఒక్కముక్కలో చెప్పాలంటే వరలక్ష్మమ్మ సామాజిక సేవ, సాహిత్యానికి ఆమె చేసిన సేవకేమాత్రమూ తీసిపోనిది. సువర్ణాక్షరములతో లిఖించదగినది

**యువతీ విద్యాలయము :** కనుపర్తి వరలక్ష్మమ్మ మహిళాభ్యుదయ లక్ష్యంతో, బీజంగా నాటి, దాన్ని జాగ్రత్తగా పెంచి, పోషించి మహావృక్షంగా తీర్చి దిద్దింది స్త్రీహితైషిణీ మండలిని. ఆ వృక్షానికి పూసిన పూవే, దాని ఫలమే, యువతీ విద్యాలయం

1959లో, సెంట్రల్ సోషల్ వెల్ఫేర్ బోర్డువారిచ్చిన గ్రాంటుతో, కనుపర్తి వరలక్ష్మమ్మ బాపట్ల స్త్రీహితైషిణీ మండలిలో యువతీ విద్యాలయాన్ని ప్రారంభించారు.

అది, వయోజనులైన స్త్రీలకు విద్యగరుపడానికి ఉద్దేశించిన సంక్షిప్త విద్యావిధానం. దాసరి శారద, కమలాదేవి, ఇందిరాదేవి, శ్రీలక్ష్మి అనేవారిని, కేవలము సామర్థ్యమే అర్హతగా తీసుకొని ఉపాధ్యాయినులుగా నియమించారు వరలక్ష్మమ్మగారు. ఉపాధ్యాయినులు,

విద్యార్థినులకు పాఠాలు సరిగా చెబుతున్నారో లేదో, విద్యాలయంలో క్రమశిక్షణ ఎలా ఉందో, అంతా సమధికోత్సాహంతో చదువు సాగిస్తున్నారా-మొదలైన విషయాలన్నీ పర్యవేక్షిస్తూ, మధ్యమధ్య తాను కూడా పాఠాలు చెబుతూ ఉండేవారు వరలక్ష్మమ్మగారు.

వారానికి ఒకమారు తప్పనిసరిగా ఉపాధ్యాయినులనూ, విద్యార్థినులనూ ఒక చోట చేర్చి, ఆ వారంలో వివిధ పత్రికల్లో వచ్చిన విశేషాల్నీ, తెలుసుకోవలసిన మంచి సంగతుల్నీ వినిపించేవారు. పండగవస్తే, ముఖ్యంగా శ్రావణమాసంలోని వరలక్ష్మీవ్రతం పండుగవస్తే, విద్యాలయం అంతా పండగ సంరంభంతో నిండిపోయేది.

ఆటల పోటీలూ, వక్తృత్వపుపోటీలూ, వ్యాసరచన పోటీలూ, భారత భాగవతాది గ్రంథల్లోని ముఖ్యఘట్టాల్ని కంఠస్థం చేసే పోటీలూ, ఇలా ఒకటే పోటీలు, ఒకటే విజిగీష-విజేతలకి బహుమతులిచ్చి విద్యార్థినుల్లో పఠనాసక్తిని పెంచారు. వారికి ఉచ్చారణా స్పష్టతని నేర్పారు. అర్థగ్రహణ సామర్థ్యాన్ని అలవర్చారు. సంఘీభావము బోధించారు. నాటిక ప్రదర్శనలు ఏర్పాటుచేసి, విద్యార్థినుల్లో కళాభిజ్ఞతని కలిగించారు.

విద్యాలయంలో రోజూ ఒక ఉపయుక్తమైన కార్యక్రమం ఉండేది.

చదువూ-చదువుతో బాటు వ్యక్తిత్వవికాసము.

విజ్ఞానము-విజ్ఞానంతో బాటు వినోదము.

క్రమశిక్షణ-క్రమశిక్షణతో బాటు చనువూ సామీప్యము.

చక్కని చదువు చెప్పి-శుచిగానూ రుచిగానూ ఉండే భోజనం ఏర్పాటు చేసి, ఎందరో విద్యార్థినుల్ని 8వ తరగతి పబ్లిక్ పరీక్షకి కూర్చోబెట్టి, వారు ఉత్తీర్ణులై వృద్ధిలోకి వస్తే, ఆమె ఎంతో సంతోషించేవారు.

ఆమెది పరిణతమైన బుద్ధి

పసిపిల్లల మనస్సు.

మాతృమూర్తికి ఉండే హృదయం

- ఆమె సమాజానికి చేసిన మహత్తరమైన సేవలో, ఈ మూడు లక్షణాలూ స్పష్టంగా కనిపించేవి. ఇంతసేవ చేశాననే, అహమికకాని గర్వంకాని ఆమెకి ఏకోశానా ఉండేదికాదు. నిగర్వి-సజ్జన, సౌజన్య, సహృదయతలకి ఆమె ప్రతీకగా బ్రతికారు.

# దేశభక్తి-రాజకీయ జీవితం

**దేశభక్తి:** కరుణగల తల్లి మా పాలి కల్పవల్లి

అమ్మ భారతి! వందనమమ్మ నీకు!

అంటూ కవితల్లి, దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజున, ప్రధమ స్వాతంత్ర్య మహోత్సవ శుభసమయాన, మద్రాసు రేడియో కేంద్రంనుంచి గళమెత్తి,

ఆ భరతధాత్రి నా తల్లి కంజలిడుదు

నవ్య స్వాతంత్ర్య వైభవ భవ్యవేళ

అని మాతృభూమి అయిన భారతదేశానికి జేజేలు పల్కిన కనుపర్తి వరలక్ష్మమ్మ, బాల్యంనుంచీ, దేశం పట్లా సోదరీసోదరులైన దేశస్థుల పట్లా, గాఢానురక్తినీ అభిమానాన్నీ పెంచుకొన్న వ్యక్తి. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అనే మహావాక్యాన్ని లోకానికి అందించిన శ్రీమద్రామాయణాన్ని అన్నగార్ల ప్రోత్సాహంతో చిన్న నాటనే చదివింది. పుట్టింది చదువు సంధ్యలున్న సంస్కారకుటుంబంలో; పెరిగింది విద్యానాగరికతలు వెల్లి విరిసిన బాపట్ల వాతావరణంలో; వివాహమాడింది నీతి నిజాయితీలు గల విద్యావంతుడైన హనుమంతరావుగారిని. అయన వేషభాషల్లో విజాతీయుడుగా ఉండేవారే కాని, హృదయం నిండా దేశభక్తే! మాతృదేశాభిమానమే!

మరి ఇంక అటువంటి వాతావరణంలో పెరిగి పెద్దదయి, లోకానుభవం గడించిన కనుపర్తి వరలక్ష్మమ్మకి దేశాభిమానం, మాతృభూమి పై విశేషాదర గౌరవాలూ ఉండడంలో ఆశ్చర్యం ఏముంది?

ఆమె పెరిగి పెద్దది ఆయేటప్పటికి, అంటే 1910-1920 ప్రాంతానికి, ఆసేతు శీతాచలం, స్వాతంత్ర్య సమరోత్సాహంతో ఉ(ర్రూతలూగిపోతోంది. లాల్ బాల్ పాల్ అంటూ పిలవబడే ముగ్గురిలో లాలాలజపతిరాయ్ అనే పంజాబు సింహం, బాలగంగాధర తిలక్ అనే మహారాష్ట్ర మహాశక్తీ, బిపిన్ చంద్రపాల్ అనే ఉపన్యాస జలపాతం, తమ త్యాగాలతో ప్రబోధాలతో, ఉపన్యాసాలతో యావద్భారత జాతినీ మేల్కొల్పి వారి హృదయాల్లో దేశభక్తి దీపాన్ని వెలిగించారు. 1920 నాటికి మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ ఆఫ్రికానుండి, తిరిగి భారతదేశం వచ్చి, స్వాతంత్ర్య సమర బాధ్యతని స్వీకరించి, ప్రజల హృదయాల్లో వెలుగుతూన్న స్వాతంత్ర్యకాంక్షజ్యోతుల్ని, తన సహాయనిరాకరణ, శాసనోల్లంఘన, సత్యాగ్రహాది కృత్యాల ద్వారా, జ్వాజ్వల్యమానం చేశారు.

స్వాతంత్ర్యకాంక్ష దేశీయులందరి గుండెల్లోనూ దేదీప్యమానంగా వెలిగిపోతోంది. రాట్నం పై నూలు వడకడం, ఖద్దరు కట్టడం, విదేశీ వస్తు బహిష్కరణ, దేశీయ విద్యాబోధన, గ్రామపారిశుధ్యం, హరిజనోద్ధరణ ఇవన్నీ స్వాతంత్ర్య సముపార్జనకి సాధనాలుగానూ, దేశభక్తికి సంకేతాలుగానూ స్థిరపడ్డాయి.

అటువంటి వాతావరణం చుట్టూ ఉండడంతో, వరలక్ష్మమ్మ, స్తబ్దుగా ఉండలేకపోయారు. భర్త ఉద్యోగరీత్యా మదనపల్లె వెళ్ళినప్పుడు, అక్కడ ఉన్న మహిళల్ని చేర్చి, వారం వారం ఉపన్యాసాలిచ్చి, వారిలో దేశాభిమానాన్నీ స్వాతంత్ర్యకాంక్షనీ పెంపొందించారు. తాను రాసిన శారద లేఖల్లో, విదేశీ వస్తు బహిష్కరణ, రాట్నం పై నూలు వడకడం, ఉప్పు సత్యాగ్రహం వంటి విషయాల్ని ప్రస్తావించి, స్వాతంత్ర్యసముపార్జనకోసం సాగుతూన్న ఈ సమరంలో, స్త్రీలు కూడా విరివిగా పాల్గొనాలని, దేశభక్తి ఒక్క పురుషులకే కాదు, స్త్రీలకి కూడా ఉందని నిరూపించాలి, అంటూ ప్రబోధించారు.

'మహాత్ముని ఉపవాస ఫలితము' అనే విషయం పై బొంబాయి కళ్యాణ సంఘమువారు ఏర్పరచిన పోటీలో పాల్గొని, గాంధీ చిత్రం గల రజత పతకాన్ని గెల్చుకున్నారు.

సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా సాగుతూన్న రోజుల్లో, భర్త అయిన హనుమంతరావు గారికి, నాటి బెజవాడ అయిన విజయవాడకి బదిలీ కావడంతోవరలక్ష్మమ్మ కొన్నాళ్ళు ఆ పట్టణంలో ఉన్నారు. అప్పుడు స్నేహితురాండ్రతో కలిసి, ఆమె స్వరాజ్యలక్ష్మీ వ్రతం చేశారు రాట్నలక్ష్మి పూజలు చేసి, స్వదేశీదీక్షా సూత్రాల్ని ముంజేతికి కట్టుకున్నారు. తిలక్ స్వరాజ్య నిధికి కోటి రూపాయలు సేకరించే కార్యక్రమంలో పాల్గొని, తాను కూడా, విరాళాలు సేకరించి ఆ నిధికి పంపారు.

వరలక్ష్మమ్మ బందరు అని పిలువబడే మచిలీపట్నంలో ఉండగా, 1921లో స్వరాజ్యనిధి సేకరణకై మహాత్మగాంధీ ఆంధ్రప్రాంత పర్యటన కావిస్తూ మచిలీపట్నం వచ్చారు. జాతీయ కళాశాలలో బస చేశారు అప్పుడు అన్నగారి ఇంటనున్న వరలక్ష్మమ్మ తమ తల్లి గారైన హనుమాయమ్మగారితో కలిసి బాపూజీని దర్శించడానికి వెళ్ళారు. వెళ్ళేటప్పుడు, అప్పటికే రాట్నం పై తను వడికి ఉంచిన నూలు, ఒకమాలగా పట్టుకొని వెళ్ళారు ఆ మాలతో బాటు స్వరాజ్య నిధికై, తనవేలిని ఉన్న ఉంగరాన్ని కూడా బాపూజీకి ఇయ్యబోయారు. అప్పుడామె కట్టుకొన్నది విదేశంలో తయారైన నూలు చీర. బాపూజీ నవ్వి "రోజూనూలు వడుకుతున్నారా? మరి మిల్లు చీర కట్టారేం? ఇక నుంచైనా ఖద్దరు కడతారా?" అని అడిగారు. వెంటనే "అలాగే కడతాను" అని బాపూజీకి మాట ఇచ్చి, తాను తెచ్చిన నూలు మాలనీ ఉంగరాన్నీ బాపూజీకి సమర్పించారు. అప్పటినుంచి వార్ధక్యం వచ్చి, వంట్లో ఓపిక తగ్గి, లేవలేని పరిస్థితి వచ్చే దాకా వరలక్ష్మమ్మగారు ఖద్దరే కట్టారు. ఆ తర్వాత అయినా, నేత చీరే కట్టారు కాని మిల్లు చీర కట్టలేదు. వరలక్ష్మమ్మ గారు చనిపోయినప్పుడు, అంతకుముందు ఆమె కోరుకున్నట్లుగా శవం మీద ఖద్దరు వస్త్రాన్నే కప్పి శ్మశానానికి తీసుకువెళ్ళారు ఆమె బంధువులూ మిత్రులూను-ఖద్దరు ధారణ పట్ల ఆమెకు గల దీక్షాదక్షతలు అంత గొప్పవి.

ఒంట్లో ఓపిక ఉన్నంతవరకూ ఆమె రాట్నం వడికారు. ఖద్దరు కట్టారు. తాను స్థాపించిన స్త్రీహితైషిణీ మండలిలో దేశభక్తిని పెంపొందించే కార్యక్రమాలు నిర్వహించారు. దేశభక్తిని పెంపొందించే పాటల్నీ నాటికల్నీ తను స్వయంగా రాసి విద్యార్థినుల చేత ఆ పాటలు పాడించి, ఆ నాటికలు వేయించారు. ఆమె రాసిన దేశభక్తి రచనల్లో కొన్ని

నవభారతేతిహాసము
రాణిమల్లమ్మ
మహాత్మాగాంధీ జీవితము
ఇందిరాగాంధీ జీవితము
నమో ఆంధ్రమాత
భరతమాత వందనము (1947 ఆగష్టు 16వ మద్రాసు రేడియో కవితా గోష్ఠిలో చదివిన పద్యాలు)
భరతమాత ప్రశంస
స్వాతంత్రోత్సవము
ఆంధ్రమాత వందనము
నమో ఆంధ్రమాత
ప్రబోధగీతాలు -

వీటిలో ఎక్కువభాగం పద్యాలూ, గేయాలూ, దేశాభిమానంతోబాటు ఆంధ్రాభిమానం కూడా అమితంగా ఉండేది. ప్రత్యేకాంధ్ర రాష్ట్రం అవసరం అని ఆమె ఉపన్యాసాలిచ్చారు. రచనలు చేశారు. ఆంధ్ర ప్రాంతంలో ఉండే ఆచారాలూ, అలవాట్లూ, పండగలూ, పబ్బాలూ, పల్లెలూ, ప్రజలు సాగించే మధురజీవనం, ప్రకృతి సౌందర్యాలూ, ఆప్యాయతలూ, హాస్యోక్తులూ-ఒకటేమిటి? తెలుగుల సొత్తయిన సమస్త రామణీయకతలూ ఆమెని పలకరించేవే, పులకరింపజేసేవే!

**రాజకీయ జీవితం :** వరలక్ష్మమ్మ రాజకీయాల్లో ప్రత్యక్షంగా పాల్గొని, సత్యాగ్రహాలు చేసి, కారాగార శిక్షలు అనుభవించలేదు. అయితే, రాజకీయ పరిస్థితులు అధ్యయనం చేసేవారు, తనతోటి స్త్రీలలో రాజకీయం చైతన్యం కలిగించే వారు. విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ వస్త్ర ధారణ, రాట్నం పై వడకడం, మొదలైన విషయాల్నిగూర్చి ఆమె వ్రాసిన వ్రాతలవల్ల ఎందరో స్త్రీలు ఇళ్ళు వీడి బయలుదేరారు. శ్రీమంతులు కూడా నూలువడికి ఖద్దరు ధరించనారంభించారు. ఎందరో స్త్రీలు ఆమె ఉపన్యాసాలతో ఉత్తేజితులై విదేశీ వస్తు బహిష్కరణ, మద్యపాన నిషేధం, లక్ష్యాలుగా, అంగళ్ళముందు పికెటింగ్ చేశారు. ఉప్పు సత్యాగ్రహంలో సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు.

ఒక శారద లేఖ వెలువడిందంటే కొందరు స్త్రీలు ఉత్తేజితులై, మారుమూల గ్రామాలనుంచి కూడా వచ్చి రాజకీయోద్యమంలో పాల్గొన్నారన్నమాటే-ఒకరిద్దరు స్త్రీలు వరలక్ష్మమ్మగారి ఉత్తేజపూర్వకమైన శారదలేఖలు చదివి సత్యాగ్రహంలో పాల్గొని జైళ్ళకివెళ్ళి, ఆ జైళ్ళలోనే పురుళ్ళు పోసుకున్నారు.

శారద లేఖల ద్వారా ఆంధ్రదేశంలో ఆమె ఎంతో ఉత్సాహ ఉద్వేగాలు రేకెత్తించారు.

గాంధీని స్తుతిస్తూ వరలక్ష్మమ్మ గాంధీ దండకం రాశారు.

గాంధీపై, భరతమాతపై, ఆంధ్రుల ప్రియతమ నాయకుడైన ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారిపై, పాటలూ, పద్యాలూ రాశారు

ఉదాహరణకి కొన్ని -

గాంధీని కీర్తిస్తూ -

ఖగనాధుండమరేంద్రు గెల్చి సుధమున్గైకొన్న చందంబునన్
తగవున్ సత్యమతిక్రమింపక ధౌర్త్యంబేమి లేకుండనే
పగరన్ గెల్చి స్వరాజ్యమన్ సుధను సంపాదించి మా గాంధిజీ
వగపున్ బాపెను భారతాంబకిక వహ్వా! చూడుడీ నేటితో
అంటూ కొన్ని పద్యాలు రాశారు.

'భరతమాతవందనం' అంటూ రాసిన పద్యాల్లో, ఈ క్రింది పద్యం, ప్రముఖ భారత నారీమణుల్ని కీర్తిస్తూ రాసినది -

సకలనారీలోక సంస్తూయమానవౌ
శ్రీ సరోజిని గన్నశిష్ట చరిత
వివిధ ఖండాలలో విఖ్యాతిగాంచిన
విజయలక్ష్మిని గన్న వీరచరిత
అజదు వీరుల గూడి యాలంబు సేసిన
లక్ష్మి యోధనుగన్న లలిత చరిత
స్త్రీజనోద్ధరణకై సేవావ్రతాసక్త
మా పార్వతినిగన్నమహిత చరిత
హంసమెహతా సుచేతయు నమృతకౌరు
కమల యరుణాది వనితలగన్న తల్లి
కరుణగల తల్లి మా పాలికల్పవల్లి
అమ్మ భారతీవందనమమ్మనీకు -

ఆంధ్రమాతకి వందనం అంటూ, వరలక్ష్మమ్మ తెలుగు తల్లి కన్నబిడ్డల్ని ఇలా స్మరించారు.

కవయిత్రి మొల్లమ్మ కమ్మని కైతల
మహిమగాంచినది మా మాతృభూమి
విమల వేదాంతార్థ విజ్ఞాత వెంగమ్మ
బోధలందినది నా పుణ్యభూమి
రాజ్యపాలన దక్షరాజ్ఞిరుద్రమదేవి
రాజ్యమేలినది నా రమ్యభూమి
సాధ్వి మల్లమదేవి సహగమనము చేత
పూతమైనది నాదు పుణ్యభూమి
మఱియు నాగమ్మ లక్ష్మమ్మ మాచమాది
నారీమణులగనినది నా సౌరభూమి
అట్టి నాయాంధ్ర భూమికి ననుదినంబు
హస్తములు మోడ్చి మ్రొక్కెద నధికభక్తి

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారి శతజయంత్యుత్సవాల్ని పురస్కరించుకొని, ఆ మహానాయకుణ్ణి 'ప్రజల మనిషి' అంటూ ఈ క్రింది విధంగా ప్రస్తుతించారు -

ఆంధ్రకేసరి యన నఖిలాంధ్ర సీమను
ప్రఖ్యాత నాముడై పరగె నెవడు
స్వాతంత్ర్యసమరాన సర్కారు కెదురొడ్డి
గుండె చూపె నెవడు గుండ్లకెదుట
గాంధీ మహాత్ముని ఘనతరానుచరుడై
సత్యాగ్రహంబులు సలిపె నెవడు
కష్టసుఖంబులు గణియింపకుండను
చెఱసాల వాసముల్ చేసెనెవడు
అట్టి టంగుటూర్వంశజు ననఘయశుని
శ్రీ ప్రకాశము పంతులుశ్శిష్టచరితు
శతజయంత్యుత్సవంబులు జరుపబడుట
భావ్యమేగాదు నాంధ్రుల భాగ్యమగును

రాజకీయోద్యమాలకి, తన రచనల ద్వారా , ఒక్కొక్కప్పుడు విరాళాలు పోగుచేసి ధనరూపంలోనూ చేయూతనిచ్చేవారు. అంతకంటే ముఖ్యం; నాటి ప్రసిద్ధ రాజకీయ మూర్తుల్ని గౌరవించారు. కొందరితో స్నేహాన్నీ సాన్నిహిత్యాన్నీ పెంచుకొన్నారు.

హితైషిణీ మండలి తరఫున నాటి ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, తల్లావజ్ఝల శివశంకరస్వామి వంటి సాహితీవేత్తలతోబాటు, రాజకీయ ముఖ్యులైన దేశోద్ధారక కాశీనాధనాగేశ్వరరావు పంతులుగారినీ, నాటి కాంగ్రెస్ ప్రెసిడెంట్ అయిన శ్రీ బాబూ రాజేంద్రప్రసాద్ గారినీ, దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ దంపతుల్నీ గౌరవించి సన్మానించారు.

ఆమె తన స్నేహాన్నీ, సాన్నిహిత్యాన్నీ పెంపొందించుకొన్న రాజకీయ వేత్తలలో
శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి
ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు
కొండావెంకటప్పయ్యగారి కుటుంబసభ్యులూ
దామోదరం సంజీవయ్య
అక్బరలీఖాను
బూర్గుల రామకృష్ణారావు
వల్లూరి బసవరాజు

శ్రీమతి సరోజినీదేవి మొదలైనవారు ముఖ్యులు హైదరాబాద్‌లోని ఆంధ్ర యువతీ మండలిలో ఉపన్యాసం ఇవ్వడానికి వచ్చినప్పుడు, ఆమెకి బూర్గుల రామకృష్ణారావుగారు

పరిచయం అయ్యారు. ప్రసిద్ధ ప్రజాసేవకురాలైన టి. వరలక్ష్మమ్మగారి షష్టిపూర్తి మహోత్సవానికి అధ్యక్షత వహించడానికై శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ బాపట్లనుంచి హైదరాబాదు వచ్చారు 1946లో. ఆ సభా ప్రారంభకులు భారత కోకిల శ్రీమతి సరోజినీ నాయుడు.

నాటి సభలో సరోజినీ నాయుడుగారి ఆంగ్లోపన్యాసమును తెలుగులోకి, అలాగే వరలక్ష్మమ్మగారు తెలుగులో ఇచ్చిన అధ్యక్షోపన్యాసమును ఆంగ్లంలోకి, అప్పటి ప్రసిద్ధ రాజకీయవేత్త, ఆ పిమ్మటి స్వతంత్ర నైజామ్ రాష్ట్ర ముఖ్యమంత్రీ అయిన శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు అనువదించారు. వరలక్ష్మమ్మగారి అధ్యక్షోపన్యాస, సారాంశాన్ని ఆంగ్లంలో విని, సరోజినీ దేవి సంతోషించారు. ఆమెతో కలిసి నేలమీద కూర్చుని రుద్రమ నాటిక చూశారు. ఆమెతో కలిసి ఫోటో తీయించుకున్నారు. అటు పిమ్మట వరలక్ష్మమ్మని తన యింటికి ఆహ్వానించి, సత్కరించారు.

స్వాతంత్ర్య సమరయోధురాలు, స్త్రీ జనోద్ధరణకై కంకణము కట్టుకొని, ఆంధ్ర మహిళాసభవంటి ఎన్నో సంస్థల్ని స్థాపించి, నిర్వహించి, భారతీయ మహిళలకందరికీ చిరస్మరణీయురాలైన శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌తో వరలక్ష్మమ్మగారికి సన్నిహితమైన స్నేహం ఉండేది. దేశ్‌ముఖ్, దుర్గాబాయ్ దంపతులు, వరలక్ష్మమ్మగారి ఆహ్వానం పై బాపట్ల వచ్చి స్త్రీహితైషిణీ మండలి దర్శించారు. దేశ్‌ముఖ్ దంపతుల్ని హితైషిణీ మండలి సన్మానించింది. ఆ సన్మానసభలో, దుర్గాభాయ్ వరలక్ష్మమ్మని ప్రత్యేకం పిలిచి తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నారు. దుర్గాబాయ్ ఆహ్వానం పై వరలక్ష్మమ్మ మద్రాసు వెళ్ళి అక్కడ దుర్గాబాయ్ నిర్వహించే మహిళా సంస్థనీ, విద్యాసంస్థనీ, ఇతర సంస్థల్నీ చూసి ముగ్ధురాలై కొన్ని పద్యాలు రాశారు. అందులో ఒక పద్యం -

ఉమకును రమకును వాణికి
అమర నొకే రూప మంది యవని జనింపన్
తమక మొదవగ స్త్రీకల్ప
ద్రుమమైయిట బుట్టి తీవు దుర్గాబాయీ!

1960లో ఆంధ్రయువతీ మండలి, హైదరాబాదు రజతోత్సవ సంఘంవారి ఆహ్వానాన్ని అందుకొని వరలక్ష్మమ్మ ఆ రజతోత్సవ సభల్లో పాల్గొనడానికి హైదరావాదు వెళ్ళారు. సభలు మూడు రోజులు జరిగాయి. ఒక రోజు సభలో వరలక్ష్మమ్మగారు ఉపన్యసించారు. సభకి అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్యగారు అధ్యక్షులు. సంజీవయ్యగారికి వరలక్ష్మమ్మగారు మహిళా సమస్యల్ని వివరించి, రాజకీయాల్లో మహిళలకి

తగిన ప్రాతినిధ్యం లభించడం లేదనీ, మహిళల్లో రాజకీయ చైతన్యం రావడానికి అవసరమైన కార్యక్రమాలు చేపట్టాలనీ కోరారు.

1962లో మద్రాసులో మూడు రోజులు జరిగిన ఆంధ్రమహిళా సభ రజతోత్సవాలలో, మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి.వి రాజమన్నారు, ప్రముఖ కవి, శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి, నాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి, గారలు ఒక్కొక్క రోజున ఒక్కొక్క సభకి అధ్యక్షత వహించారు. మూడవ రోజున సంజీవరెడ్డిగారు సన్మానించిన ఆంధ్రరచయిత్రులలో శ్రీమతి వరలక్ష్మమ్మ ఒకరు.

దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి కుటుంబంతో వరలక్ష్మమ్మగారికి సన్నిహితమైన మైత్రి ఉండేది. కొండా పార్వతీదేవికి వరలక్ష్మమ్మగారంటే ఎంతో గౌరవం.

అలాగే ప్రముఖ రాజకీయ వేత్త అయిన వల్లూరి బసవరాజుగారు కనుపర్తివారి సామాజిక రాజకీయ సేవల్ని బహుదా శ్లాఘించి, ఒక పర్యాయం ఆయన మంత్రిగా ఉన్నప్పుడు, స్త్రీహితైషిణీ మండలికి ఇతోధికమైన సహాయం చేశారు.

ఇలా రాజకీయాలతోనూ, రాజకీయ వేత్తలతోనూ, ఆమెకి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సాన్నిహిత్యం ఉంది.

అయితే, ఒక మారు ఆమె తిన్నగా రాజకీయాల్లోనే పాల్గొనవలసి వచ్చింది. అదేమిటంటే, గుంటూరు జిల్లా బోర్డుకి ఒక మహిళని ఎన్నుకోవలసి వచ్చింది. జిల్లా ప్రముఖుల్లో చాలా మంది కనుపర్తి వరలక్ష్మమ్మగారి పేరు సూచించారు. మొదట ఆమె తటపటాయించారు. చివరికి ఎన్నికలకి నిలబడ్డారు. అతి సునాయాసంగా, ప్రచారానికి పెద్దగా ధనం ఖర్చు చెయ్యవలసిన అవసరం లేకుండా, 1949లో గుంటూరు జిల్లా బోర్డు సభ్యులుగా ఎన్నికయ్యారు. ఆమె ఆ పదవిలో 1951వరకూ కొనసాగారు.

జిల్లాబోర్డు సభ్యురాలిగా, జిల్లాలోని పలు మహిళా సంస్థలకి సహాయం చేశారు. పాఠశాలలు లేని కొన్ని మారుమూల గ్రామాల్లో పాఠశాలలు ఏర్పరచి, ప్రాథమిక విద్యావ్యాప్తికి ఎంతగానో కృషి చేశారు.

# వ్యక్తిత్వం

వరలక్ష్మమ్మ గారిది నిండైన విగ్రహం. అంత పొడగరీ కాదు. అంతస్థూల్యమూలేదు. ప్రసన్నమైన ముఖం. ఇంక అలంకరణ, వస్త్రధారణ, చూస్తే అచ్చమైన ఆంధ్రమహిళా రూపం. తరతరాల భారతీయ సంస్కృతి, స్త్రీరూపము దాల్చివస్తే ఎలా ఉంటుందో అలా ఉండేవారు. ఆమె ఎంత సౌమ్యమైన వ్యక్తో, అంత గంభీరమైన మూర్తి. చూడగానే ఆమె పట్ల ఆత్మీయతతో బాటు గౌరవభావం కూడా కలిగేది. ఎంతమందో ఆమెతో మాట్లాడాలని ఉవ్విళ్ళూరేవారు. కాని చాలామంది జంకేవారు. మొదటి ఉత్సాహానికి ఆమె కళ్ళల్లో కనిపించే సౌజన్యం కారణం అయితే, వెంటనే వచ్చే తటపటాయింపుకి, ఆమె చూపుల్లో ఉండే నైశిత్యం.

అభినవ తిక్కన అని పేరుగాంచిన తుమ్మల సీతారామమూర్తిగారు ఆమెని 'వేదకాలంపు వెలదిముత్తయిదువ'' అని అభివర్ణించారు. నిజంగా ఆమె మాతృత్వం చిందిస్తూ అలాగే ఉండేవారు. ఆమె పట్ల విభేదించినవారు కూడా ఆమెపట్ల పూజ్యభావంతోనే మాట్లాడేవారు.

వరలక్ష్మమ్మగారి పలుకులు సరళములూ మధురములూ మాత్రమే కాదు. చైతన్య స్ఫోరకములూ, ఆలోచనా బోధకములూ కూడా. ఆమె పురుషుల వక్రమార్గములనే కాదు. స్త్రీల సంకుచిత భావాల్ని కూడా నిర్మొహమాటంగా విమర్శించేవారు మెరమెచ్చు కబుర్లూ ఇచ్చకపు మాటలూ వరలక్ష్మమ్మగారికి నచ్చవు. చెప్పదలచుకొన్నది అరమరికలు లేకుండా, సూటిగా ధాటిగా చెప్పెయ్యడమే! ఆమె మాటలో సరళత్వం ఎంత ఉండేదో, పదును కూడా అంతే ఉండేది.

ఆమె మనస్సు, ప్రాచీన నవీన అభ్యుదయ భావముల త్రివేణి సంగమము. ''ప్రతి వ్యక్తి జీవితమూ, ఒకమహాసౌధమైతే, ఆ సౌధానికి ప్రాచీన సంస్కృతి పునాది. అభ్యుదయమైన ఆలోచనలు ప్రణాళిక-సమకాలీన భావములు నిర్మాణము'' అనేవారు. సనాతనాచారాలు ఆమెకి సమ్మతమే-మూఢాచారాలను మాత్రం నిరశించేవారు.

మా తరం ముగిస్తుంది. మలితరం మహిళలు ముందుకువచ్చి, అసంపూర్ణంగా మిగిలిపోయిన స్త్రీజనాభ్యుదయ కార్యక్రమాల్ని చేపట్టాలి'' అంటూ ఎంతమంది యువతుల్నో ఆమె ప్రోత్సాహించేవారు. విద్యావిషయికమైన విజ్ఞానమార్గంలో అభివృద్ధి చెందిన వారినెవరిని చూసినా, ఆమె ఆనందించేవారు-ఈర్ష్య అసూయ అనే వాటిని ఆమె ఎరుగరు.

రచనలు చేసినా, మహిళా కార్యక్రమాల్లో పాల్గొన్నా, ఉపన్యాసాలిచ్చినా, సభలు నిర్వహించినా, కనుపర్తి వరలక్ష్మమ్మగారు, గృహిణిగా తనకు గల బాధ్యతలను ఎప్పుడూ విస్మరించలేదు అలక్ష్యం చెయ్యలేదు. యువతీ విద్యాలయ విద్యార్థినుల చేత పాటలు పాడించి, వాళ్ళ మధ్య పోటీలు నిర్వహించి, వారిని సముద్ర స్నానానికి తీసుకువెళ్ళి ఆటలు ఆడించి, నాటకాలు వేయించి, బుర్రకథలు చెప్పించి, వాళ్ళలో ఒకరుగా ఉండేవారు. ఆమెది అచ్చమైన స్వచ్ఛమైన పసిహృదయం. సామర్థ్యం ఎక్కడ కనిపించినా ప్రోత్సహించేవారు.

తనకంటే చిన్న వారినందరినీ, తల్లిలా, ''అమ్మాయీ, అబ్బాయీ'' అనే పిలిచేవారు. మెల్లగా మాట్లాడేవారు. అప్యాయంగా పలకరించేవారు. మంచి మనస్సుకి అద్దం పట్టినట్లు ఆమె గొంతులో ఎంతో ఆత్మీయత ఎవరినోట విన్నా ఆమె గురించి రెండు మాటలులేవు. ఎవరు అన్నా ''కనుపర్తి వరలక్ష్మమ్మగారా! ఆమె బహుయోగ్యురాలు - అంతటిమంచి మనిషిని చూడం'' అన్నమాటే

వరలక్ష్మమ్మగారితో ఒకమారు స్నేహం చేస్తే, ఇంక అది జీవితాంతం విడరాని అనుబంధంగా ఉండిపోవలసిందే. బసవరాజు రాజ్యలక్ష్మమ్మ, ఇల్లిందల సరస్వతీ దేవి, యల్లాప్రగడ సీతాకుమారి వంటి స్నేహితురాండ్రతో ఆమె మాట్లాడుతూంటే, ఒకరి వెన్నుమీద ఒకరు చెయ్యివేసి పలకరించుకుంటూంటే, చూసే వాళ్ళ కళ్ళు ఆనందంతో చెమర్చేవి. స్నేహితులకి ప్రాణం ఇచ్చేవారు. మనస్సుకి నచ్చితే చాలు మమతానురాగాలు పంచడమే.

ఎవరితోనైనా అభిప్రాయభేదం వచ్చి విభేదించినా, ''నాకు నచ్చదు, నాకూ నీకూ కుదురదు'' అని ఊరుకోవడమే కాని కలహించడం ఆమెకి చేతకాదు. ఒకమారు ఇద్దరు స్త్రీలు ఆమె ఆంతర్యం అర్థం చేసుకోలేక, ఆమెతో వివాదం సాగించారు. ఆమెకి మనస్తాపం కూడా కలిగించారు. అయినా వారి గురించి ఆమె ఒక్క పరుషవాక్యం అనలేదు. వారి పేరు

విన్నా, తలుచుకున్నా ఆమెకి విషాదం కలిగేది. అందువల్ల ఆమె ఏం చేశారో తెలుసా? ఆ ఇద్దరి పేర్లూ వచ్చే, ''శాంతాకారం భుజగశయనం'' అనే శ్లోకాన్ని కొన్నాళ్ళు పఠించడం మానేశారు అంతవరకే ఆమె కోపం. ఆ తర్వాత ఆ మహిళలిద్దరూ పశ్చాత్తాపంతో తిరిగి వచ్చి, ఆమెని కలుసుకున్నారు దాంతో ఆమెకి గల ఆ కొంచెంకోపం కూడా పోయింది

కనుపర్తి వరలక్ష్మమ్మగారు

విజ్ఞుల్లో విజ్ఞులు -
విద్వాంసుల్లో విద్వాంసులు -
అరిందాల్లో అరిందా -
పిల్లల్లో పసిపిల్ల -

ఆమెకి పిల్లలు లేరు. కాని అందరూ ఆమె బిడ్డలే. పిల్లలతో ఆడుకునేవారు-తన ఈడువారితో అప్యాయంగా మాట్లాడేవారు వృద్ధులతో, క్షేమ సమాచారమడుగుతూ గౌరవంగా పలకరించేవారు ఏ వయస్సు వాళ్ళతో ఆ వయస్సుకి తగ్గట్లు మాట్లాడుతూ ఉండేవారు వరలక్ష్మమ్మగారితో మాట్లాడుతుంటే ఇంకా మాట్లాడాలనిపించేది. అందరి ప్రేమనూ ఆమె చూరగొన్నారు చక్కని మృదువైన హాస్యం, ప్రపంచ విజ్ఞానం, ప్రేమ, మధుర భాషణ, ఆత్మీయత, ఇవన్నీ ఆమె మాటల్లో మిళితం అయి ఉండేవి ఎప్పుడూ ఆమె ముఖంమీద చిరునవ్వు తాండవిస్తూ ఉండేది.

ఆమె చమత్కారంగా మాట్లాడేవారు.

స్నేహితురాలైన కామరాజు వెంకటలక్ష్మమ్మగారు ఒకమారు శివరామయ్యగారింటికి గృహోపకరణ వస్తుసముదాయాన్ని పురమాయించడానికి వెళ్ళి, స్త్రీహితైషిణీ మండలికి ఆలశ్యంగా వచ్చారు - ఆ సంగతి వరలక్ష్మమ్మగారికి తెలుసు ఆలశ్యంగా వచ్చిన వెంకటలక్ష్మమ్మతో ''ఏమమ్మా శివాలయానికి వెళ్ళావా? శివదర్శనం అయిందా?'' అన్నారు వెంకటలక్ష్మమ్మ మొదట తెల్లబోయు, తర్వాత నవ్వుకొని ''ఆ. ఆ . శివరామయ్య ఇంటికి వెళ్ళాను. కనిపించాడు'' అని సమాధానం చెప్పారు.

వరలక్ష్మమ్మ మంచివక్త ఎన్నో విషయాల్ని చెప్తూ, మధ్య మధ్య, ఉదాహరణలిస్తూ, వాక్చాతుర్యంతో, సరళమైన శైలిలో చక్కని కంఠస్వరంతో మాట్లాడేవారు. ఆమె చెప్పే అపూర్వమైన విషయాలు విద్వాంసులకు కూడా ఆశ్చర్యం కలిగించేవి. మాట్లాడే విధానం శ్రోతల్ని అకట్టుకొనేది.

నాకీ పదవి కావాలి-ఈ గౌరవం లభించాలి. అని ఆమె ఎప్పుడూ కోరుకోనూ లేదు-అందుకు ప్రయత్నించాలేదు-వచ్చిన గౌరవాలూ, మర్యాదలూ వాటి అంతట అవే ఆమెని వెతుక్కుంటూ వచ్చాయి. మండలి రజితోత్సవం నాడు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సమక్షంలో ఆమెకి సన్మానం జరిగితే 'నేనేం ఘనకార్యం చేశానని నాకీ సన్మానం?'' అన్నారే కాని, తనకి జరిగిన ఘనసన్మానికి, పొంగిపోలేదు-ఆమె నిగర్వి.

వరలక్ష్మమ్మ 'ఇందిరాగాంధీ' పై, చిన్న పుస్తకం రాశారు. దాన్ని శ్రీ గోదాగ్రంథమాల తరపున ఆ గ్రంథమాల వ్యవస్థాపక ప్రకాశకుడైన శ్రీమాన్ కె.టి.యల్. నరసింహాచార్యులుగారు ప్రకటించారు. ప్రకటించి, ఆ గ్రంథం రచించినందుకు వరలక్ష్మమ్మగారికి కొంత పారితోషికం పంపించారు. కాని ఆమె ఆ సొమ్ము తీసుకోకుండా ''దీన్ని మీ గ్రంధమాల అభివృద్ధికి ఉపయోగించండి'' అని తిరిగి ఇచ్చేశారు. అలాగే ఆంధ్రపత్రికలో ఆమె రచించిన 'మా చెట్టు నీడ ముచ్చట్లు' అనే వ్యాసపరంపరకి, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, కొంతపారితోషికాన్ని ఇయ్యబోగా, ''విజ్ఞానాన్ని నేను అమ్ముకోనండి'' అంటూ ఆమె నమ్రతగా నిరాకరించారు.

కనుపర్తి వరలక్ష్మమ్మగారి అలవాట్లూ, అభిప్రాయాలూ, ఆశయాలూ, వ్యక్తిత్వం, కొంతలొకొంత అర్థం కావడానికి, రచనల్లోనూ, ఉపన్యాసాల్లోనూ, సంభాషణల్లోనూ, ఆమె వెల్లడించిన భావాలు ఉపకరిస్తాయి

ఆమె సుభాషితాల్లో కొన్ని -

''నా జీవము ధర్మము, నా మతము నీతి, నా లక్ష్యము సతిశ్రేయము. ఈ మూటిని సమర్థించుటకే నేను చేతకలము బూనితిని.

★ ★ ★

ప్రతిఫలాకాంక్షలేని, సేవాపరాయణుల్ని లోకమే గుర్తించి మన్నించును.

★ ★ ★

విదేశపు మెఱుగులు మనమెఱుగును రూపుమాపుచున్నవి

★ ★ ★

ఒకస్త్రీ ప్రాణము దీసిన నేరముకంటే, ఒక స్త్రీ సుఖమును, సంతోషమును, ఉత్సాహ ఉల్లాసములను నాశనము చేసి, జీవన్మృతురాలిగా చేసిన నేరము, బలవత్తరమైనది.

★ ★ ★

నిర్మలమును కరుణాపూరితమును ప్రేమ పూర్ణము నగు హృదయమును గలిగియుండుటయే స్త్రీకి నిజమైన సౌందర్యము.

★ ★ ★

మనుష్యుని విపరీతమైన స్వేచ్ఛ, అతని జ్ఞానమునకు నిదర్శనము కాజాలదు

★ ★ ★

స్వశక్తిచే స్త్రీ, లక్ష్మియు సరస్వతియు కావచ్చును

★ ★ ★

నీతి, సత్యములకు జ్ఞానము నిబద్ధము కావలెను అప్పుడే జనసామాన్యత లభించును.

★ ★ ★

ఈడేరిన బిడ్డ తల్లిదండ్రులకు భారం కాక పాయినా లోకానికి బరువు.

★ ★ ★

స్వేచ్ఛా సహజమైన మానవుల వర్తనములను, ఒక నీతికి, ఒక ధర్మమునకు, ఒక సత్యమునకు, ఒక సంప్రదాయమునకు, బద్ధపరచునదే మతము

# సన్మానాలూ-గౌరవాలూ

''ప్రతిఫలాకాంక్షలేని సేవాపరాయణులను లోకమే గుర్తించి మన్నించును'' అని కనుపర్తి వరలక్ష్మమ్మగారు ఒక సందర్భంలో అన్నారు-ఇది ఆమె పట్ల ఋజువైంది. వరలక్ష్మమ్మగారికి, ఆమె సాహిత్య సామాజిక సేవలకి గుర్తింపుగా ఎన్నో సత్కారాలూ సన్మానాలూ వాటంతటు అవే లభించాయి. అన్నీ ఆమెని వరించివచ్చినవే!

నరసాపురం తాలూకా అభివృద్ధి సంఘం స్త్రీలబహుమతి పరీక్షలో వరలక్ష్మమ్మ ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణురాలై బంగారు పతకం గెల్చుకున్నారు.

1930లో 'స్త్రీ అబల కాదు' అనే శీర్షికతో గృహలక్ష్మి పత్రికవారు నిర్వహించిన వ్యాసరచనల పోటీలో ఆమెకు సువర్ణ పతకం లభించింది.

బొంబాయి కళ్యాణ సంఘంవారు 'మహాత్ముని ఉపవాస ఫలితము' అనే విషయము పై వ్యాసరచన పోటి ఏర్పాటు చేశారు ఆ పోటీలో గెలుపొంది వరలక్ష్మమ్మ వోసూరి నారాయణస్వామి నాయుడుగారి స్వర్ణ పతకాన్ని గెలుచుకున్నారు.

గృహలక్ష్మి పత్రికలో ఎన్నో కథలూ, వ్యాసాలతో బాటు, ఆరు సంవత్సరములు నిర్విరామంగా 'శారద లేఖలు' అనే శీర్షికని వరలక్ష్మమ్మ నిర్వహించి యావదాంధ్ర పాఠక లోకాన్నీ, సంతోషపెట్టారు. ఎన్నో విజ్ఞానదాయకమైన సంగతులు అందించారు ఆ లేఖలు చదివి ఎందరో వివేకవంతులై తమ జీవితాల్ని సుసంపన్నం చేసుకొన్నారు ఆ విధంగా ఆమె సాహిత్యానికీ సమాజానికీ గృహలక్ష్మి పత్రికకి అందించిన సేవలకి గుర్తింపుగా, గృహలక్ష్మి

పత్రికాధిపతి అయిన కేసరిగారు వరలక్ష్మమ్మగారిని సత్కరించాలని నిర్ణయించుకొన్నారు. గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని ఆమెకి బహుకరిస్తూ 1934లో నెల్లూరులో ఘనమైన సన్మానం చేశారు. ఆ సభలో స్వర్ణకంకణముతో బాటు 31 శారద లేఖల్ని ఒక సంపుటిగా వేసి, ఆ గ్రంథం తాలూకు వెయ్యి ప్రతులనూ, వెండి కుంకం బరిణెను, ఆమెకి కేసరిగారు సమర్పించారు. అప్పటినుంచి నేటిదాకా అనగా 66 ఏళ్ళనుంచి ప్రతియేటా గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రధానము ప్రముఖురాలైన ఆంధ్ర రచయిత్రికి ఎవరికో ఒకరికి ఆ సంస్థ వారు ఇస్తూనే ఉన్నారు. ఈ విధంగా వరలక్ష్మమ్మగారు ప్రథమ గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత.

భారత స్వాతంత్ర్య అవతరణోత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని, మద్రాసు ఆలిండియా రేడియోవారు 1947 ఆగస్టు 16వ తేదిన, ప్రఖ్యాతులైన ఆంధ్ర కవుల్ని ఆహ్వానించి ఒక కవితాగోష్ఠి ఏర్పాటు చేశారు. విశ్వనాధ, దేవులపల్లి, జాషువా వంటి ఉద్దండ కవి పండితులతో కలిసి ఆ కవితా గోష్ఠిలో పాల్గొన్న ఏకైక మహిళ శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ.

ఆలాగే ఆంధ్ర రాష్ట్ర అవతరణోత్సవ సందర్భంలో 1956 నవంబరు 1వ తేదిన విజయవాడ రేడియో స్టేషన్‌వారు ఏర్పాటు చేసిన కవితా గోష్ఠిలో కూడా ఆమె పాల్గొన్నారు ఈ రెండూ, ఆంధ్రులలో విశేషమైన కీర్తి ప్రఖ్యాతులు గడించిన మహాకవులు పాల్గొన్న కవితా గోష్ఠులే వాటిలో పాల్గొనమని రేడియోవారు వరలక్ష్మమ్మగారిని ఆహ్వానించడం, ఆమెని అపూర్వంగా సన్మానించి గౌరవించడమే! ఆ అవకాశం మహిళల్లో ఆమె ఒక్కరికే లభించడం విశేషం.

కథలు, వ్యాసాలు, లేఖలు, కవితలు, నాటికలు, వంటి రకరకాల సాహిత్య ప్రక్రియల్ని చేపట్టి ఆంధ్ర సరస్వతిని అర్చించిన వరలక్ష్మమ్మని గౌరవించి సత్కరించాలని బాపట్ల పురప్రముఖులు సంకల్పించారు. స్త్రీహితైషిణీ మండలి వంటి సంస్థల ద్వారా ఆమె సమాజానికి, ముఖ్యంగా స్త్రీలకి అందించిన సహాయ సహకారాలు అనన్య సామాన్యమైనవి. అందువలన కూడా ఆమెని అభినందించవలసిన బాధ్యత తమకి ఉంది ఇలా ఆలోచించి బాపట్లలోని పెద్దలంతా చేరి కూచిభొట్ల ప్రభాకరశాస్త్రిగారి అధ్వర్యంలో ఒక సన్మానసంఘాన్ని ఏర్పాటు చేశారు. ఆ సంఘానికి అధ్యక్షులు శ్రీమతి వెలగపూడి వైదేహి. కామరాజు వెంకటలక్ష్మమ్మ, కోన సుభద్రమ్మ, కోటంరాజు అన్నపూర్ణమ్మ, బొలిసెట్టి శాంతవతమ్మ మొదలగువారు సభ్యులు.

1-10-1952న బాపట్లలో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి సన్మాన సభ ఏర్పాటయింది. సభకి నాటి ప్రభుత్వ ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

అధ్యక్షులు. తల్లావఝ్ఝుల శివశంకరస్వామి, గుడిపూడి ఇందుమతీదేవి, శ్రీశ్రీశ్రీ అనుభవానందస్వామి, శ్రీ సింగరాజు నాగభూషణరావుగార్లు ఉపన్యాసకులు. ఆ సభలో, శాలువా, చీర, రవికెలు, వెండికుంకం భరిణెలు సమర్పించి బాపట్ల పౌరులు వరలక్ష్మమ్మని సత్కరించారు

5-4-1953న బాపట్లలో వరలక్ష్మమ్మగారికి పౌర సన్మానస్థాయిలో మరియొక ఘనసన్మానం జరిగింది. ఆ సభకి శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు అధ్యక్షత వహించగా శ్రీ వావిలాల సోమయాజులు గారు నాటిసభలో ఉపన్యసించారు. సన్మాన సంఘంతరఫున శ్రీమతి కర్లపూడి కమలమ్మ వరలక్ష్మమ్మగారిని ఘనంగా సత్కరించారు.

1960లో హైదరాబాదు ఆంధ్ర యువతీమండలి వారు, మూడు రోజులు రజతోత్సవాలు చేశారు సంగీతంలో ద్వారం మంగ తయారుగారికీ, సాహిత్యంలో వరలక్ష్మమ్మగారికీ, సంఘసేవలో శ్రీమతి అన్నపూర్ణగారికీ సన్మాన పత్రాలు సమర్పించి, సత్కార సన్మాన గౌరవాలందించారు. ఆ సభకి అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయిన శ్రీ దామోదరం సంజీవయ్యగారు అధ్యక్షత వహించారు.

1962 సం॥ మే నెలలో మద్రాసులో జరిగిన ఆంధ్ర మహిళా సభ రజితోత్సవాలలో కూడా శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారిని ఘనంగా సత్కరించారు శ్రీ పి.వి. రాజమన్నారు, శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి, శ్రీ నీలం సంజీవరెడ్డి మొదలైన హేమాహేమీలు ఆ ఉత్సవాల్లో పాల్గొన్నారు వాటిని శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ రెండు రోజులు అతివైభవంగా జరిపించి, ఒక మహిళా సామ్రాజ్యాన్నే నిర్మించారా అన్నంత ఆశ్చర్యాన్నీ ఆనందాన్నీ కల్గించారు.

1965వ సంవత్సరం ఏప్రియల్ 27, 28, 29 తేదిల్లో హైదరాబాదులో జరిగిన అఖిల భారత రచయిత్రుల సభల్లో శ్రీమతి విజయలక్ష్మి పండిట్, శ్రీమతి లీలావతీ మున్షీవంటి విదుషీమణులు పాల్గొన్నారు. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ కార్యదర్శినిగా ఉండి జరిపించిన ఆ మహాసభల్లో శ్రీమతి భానుమతీ రామకృష్ణతో సమానంగా వరలక్ష్మమ్మగారు సత్కారాలు అందుకున్నారు. గుంటూరులో ఆ తర్వాత పెద్ద ఎత్తున జరిగిన రచయిత్రుల సభలో కూడా కనుపర్తి వారికి ఘన సన్మానం జరిగింది. గుంటూరు సభలో ఇల్లిందల సరస్వతీదేవి, కొండా పార్వతీదేవి, నాయని కృష్ణకుమారి, లక్ష్మీ రఘురామ్, యశోదారెడ్డి వంటి ప్రసిద్ధ రచయిత్రుల సమక్షంలో వరలక్ష్మమ్మగారికి సన్మానం జరగడం ఒక విశేషం అయితే, ఆ సభలో ''పూర్వం రచయిత్రుల మధ్య కొరవడిన సహకారం, ఇప్పుడిప్పుడే ఏర్పడుతోందనీ, ఇది శుభసూచకమనీ'' చెప్పి, వరలక్ష్మమ్మగారు ఆంధ్ర రచయిత్రుల్ని ఉత్తేజితుల్ని చెయ్యడం, మరో విశేషం

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఏటేటా ఒక ఉత్తమ రచయితనీ, ఒక ఉత్తమ రచయిత్రినీ, వెయ్యిన్నూటపదహార్లతో సత్కరించి గౌరవించి సన్మానించాలని నిర్ణయించింది. ఆ ప్రకారం 1967 జనవరి 7వ తేదిన ప్రథమ సత్కార కార్యక్రమం నిర్వహించింది - ప్రథమ ఉత్తమ రచయిత్రి సత్కారం శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి ఇచ్చింది. ఆ సత్కార సభ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. చేబ్రోలులో సూర్యదేవర రాజ్యలక్ష్మిగారు అక్కడ ఉన్న మహిళా సంఘం తరుపున వరలక్ష్మమ్మని సత్కరించారు. 1967లో గుడివాడ శ్రీ పొట్టి శ్రీరాములు పురపాలకోన్నత పాఠశాలలో వరలక్ష్మమ్మకి సప్తతి సన్మానోత్సవ సభ జరిగింది ఆ సభకి శ్రీ కోగంటి దుర్గామల్లికార్జున రావుగారు అధ్యక్షత వహించారు.

ఆ సప్తతి సన్మాన సభలో శ్రీమతి వరలక్ష్మమ్మగారిని 'కవితా ప్రవీణ' బిరుదుతో సత్కరించారు.

1968 మే 31వ తేదిన హైదరాబాదులో జరిగిన అఖిల భారత తెలుగు రచయితల మహాసభలో నలుగురు ప్రసిద్ధ రచయితలకి సన్మానం జరిగింది. వారు, వానమామలై వరదాచారి, కాళోజీ నారాయణరావు, మునిమాణిక్యం నరసింహారావు, కనుపర్తి వరలక్ష్మమ్మగారలు ముగ్గురు ప్రసిద్ధులైన రచయితలతోబాటు సత్కరించబడిన ఒకేఒక రచయిత్రి ఆమె. ఈ నలుగురినీ నాటి ముఖ్యమంత్రి అయిన శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, నిర్మల్ సరస్వతీ ఫలకాలతోనూ, కాశ్మీరు శాలువలతోనూ, సత్కరించారు.

1975లో హైదరాబాదులో, వారంరోజుల పాటు, వైభవోపేతంగా, లాల్‌బహదూర్ స్టేడియంలో లక్షలాది ప్రజలు పాల్గొన్న గొప్ప వేడుకలు, ప్రపంచ తెలుగు మహాసభలు. ఆ సభల్లో కనుపర్తి వరలక్ష్మమ్మని కాంస్యఫలకం ఇచ్చి సత్కరించారు.

ఇలా ఎన్నో-ఎన్నెన్నో సత్కారాలు సన్మానాలు-ఆమె అన్నింటినీ వినమ్రతతోనే, స్వీకరించారు-అయినా ఆమె అన్నట్లు ''మహనీయులకు సత్కారాలూ సన్మానాలూ ఎందుకు? వారి నామాక్షరాలే వెయ్యి సత్కారాల పెట్టు''

ఆ మాట వరలక్ష్మమ్మగారి విషయంలో ప్రత్యక్షరసత్యం-

అయినా ఆంధ్ర దేశం ఆమెని గౌరవించి తనని తాను గౌరవించుకొంది

కనుపర్తి వరలక్ష్మమ్మ, ఆ విధంగా ప్రథమ గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత-ప్రథమ ఆంధ్ర సాహిత్య అకాడమీ ఉత్తమ రచయిత్రి అవార్డు గ్రహీత

అఖిల భారత తెలుగు రచయితల సభల్లో అవార్డు నందుకొన్న ప్రథమ రచయిత్రి

మద్రాసు, విజయవాడ రేడియో స్టేషన్లవారు నిర్వహించిన కవితా గోష్ఠులలో పాల్గొన్న ప్రథమ కవయిత్రి-

ఆమె బహుముఖ ప్రజ్ఞాశాలి

కీర్తిగౌరవాలందుకొన్న మాన్య చరిత

సాహిత్య సామాజిక సేవలకే జీవితాన్ని అంకితం చేసి, సహస్రమాసాల నిండుజీవితాన్ని గడిపిన ధన్యచరిత.

# ప్రముఖుల ప్రశంసలు

స్త్రీలు విద్యాభ్యాసం చెయ్యడంమాట అటుంచి, వీధిలో కనిపించడం, విజ్ఞాన సముపార్జన చేసి కలాన్ని చేపట్టి, రచనలు కావించి నారీలోకాన్ని, చైతన్యవంతం చెయ్యడానికీ, సాంఘిక సంస్థలు స్థాపించి నిర్వహించడానికీ, తర్వాత తరం స్త్రీలకీ, రచయిత్రులకీ, ఆదర్శంగా నిలవడానికీ, ఎంతటి శక్తి సామర్థ్యాలూ దీక్షాదక్షతలూ కావాలో, తలుచుకొంటేనే ఆశ్చర్యం వేస్తుంది.

అటువంటి సామర్థ్యం సంపాదించడం, కోటికి ఒక్కరికి మాత్రమే సాధ్యం. వాళ్ళెంతో అపురూపమైన వ్యక్తులు.

అలాంటి వ్యక్తుల్లో ఎన్నదగిన వారు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు.

కందుకూరి వారి సంస్కార భావాలకు తీవ్రంగా ప్రతిస్పందించి, సాంఘిక సమస్యల్నీ, జాతీయ భావాల్నీ హృదయంలో అవగాహన చేసుకొని, తన రచనల ద్వారా, ఒక క్రొత్త తరాన్ని రూపుదిద్దడం కోసం, కంకణం కట్టుకొన్న ధీశాలి ఆమె. నాటి పరిస్థితుల్ని బట్టి పద్యాలూ కవితలూ కాదని, వచనాన్ని చేపట్టి, కథలూ వ్యాసాలూ రాసి, తెలుగులో లేఖా సాహిత్యానికి శ్రీకారం చుట్టి, లేఖలకి సాహిత్య స్థాయిని సమకూర్చి పెట్టిన వాఙ్మయమూర్తి వరలక్ష్మమ్మ. ఆమె సమాజానికీ సాహిత్యానికీ చేసిన సేవని ఎందరో పెద్దలు మెచ్చుకొన్నారు. ఆమె వ్యక్తిత్వాన్ని శ్లాఘించారు. ప్రశంసావర్షం కురిపించారు అట్టి ప్రశంసలలో ముఖ్యమైనవి.

ప్రముఖ విద్యావేత్త, మేధావి, ఆంధ్ర విశ్వవిద్యాలయ కులపతి అయిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ''శ్రీమతి వరలక్ష్మమ్మగారి జీవితము, సాహిత్యము, సంస్కార

వంతమైన ఒక తరాన్ని తయారుచేసి, తెలుగు వారు మరిచిపోలేని మహోపకారం చేశాయి. ఆమె రచనల్లో కటుత్వము లేని పటుత్వము కనిపిస్తుంది ఆమె మూర్తిలో గర్వములేని గాంభీర్యము స్ఫురిస్తుంది. ఆమె జీవితంలో ఆడంబరములేని ఆదర్శము ద్యోతకమౌతుంది గత అర్ధ శతాబ్ది తాలూకు గాంభీర్యమూ, ఈ అర్ధ శతాబ్దపు తీవ్రతా, రెండూ సమానంగా సమ్యక్ సమ్మేళనం చెందిన సజీవ సాహితీమూర్తి వరలక్ష్మమ్మగారు. ఆంధ్ర జీవన సాహితీ స్రవంతుల భూత భవిష్యత్ తీరాల్ని కలిపే వర్తమాన వచన కావ్యసారధి ఆమె'' అంటూ ప్రస్తుతించారు

23-3-1980న వరలక్ష్మమ్మ స్మారక సంచిక ఆవిష్కరణ సభాధ్యక్షులు మాన్యశ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు 'మొదటి తరం రచయిత్రులలో శ్రీమతి వరలక్ష్మమ్మగారు అగ్రగణ్యులు. తర్వాత తరం రచయిత్రుల పై ఆమె ప్రభావం గణనీయంగా కనిపిస్తుంది'' అన్నారు.

కవితా గోష్ఠిలో ఆమె వ్రాసిన పద్యాల్ని శ్లాఘిస్తూ''మీకు చక్కని భాషా,శైలీ అలవడ్డాయి. ఇంత ధారాశుద్ధిగా పద్యాలు అందరూ వ్రాయలేరు'' అని మెచ్చుకొన్నారు, జ్ఞాన పీఠ అవార్డు గ్రహీత కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణగారు

అభినవతిక్కన, తెనుగులెంక, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, ప్రముఖ కవి అయిన శ్రీ తుమ్మల సీతారామమూర్తి 'సంస్కృతి' అనే శీర్షికతో వరలక్ష్మమ్మకి నివాళులర్పించారు. ఆమెని ప్రస్తుతిస్తూ అయన రాసిన ఆరు పద్యాల్లోనూ మొదటి పద్యం,

వేద కాలంపు వెలది మొత్తయిదువను ద<br>
లంపునకు దెచ్చునది వరలక్ష్మమాంబ<br>
చిత్తమున బల్కునందును జేతయందు<br>
శౌచమును సంతరించిన సాధ్వియామె

''శారద లేఖల్లోని శారద, కనుపర్తి వరలక్ష్మమ్మగారే అని, నాడు కాకపోయినా నేడైనా అందరికీ తెలుసు ఆ శారద కొన్ని లేఖల్లో సకల కళావిశారదగా కనిపించేది. రాజకీయాల ప్రసక్తి వచ్చినప్పుడు మహిషాసురమర్దినిగా సాక్షాత్కరించేది సంఘ సంస్కరణ విషయాలు వచ్చినప్పుడు మైత్రేయిలా కనులగట్టేది. విద్యాసమస్యల చర్చల్లో గార్గిలాగ దర్శనమిచ్చేది. తెల్లవారు ఝామున వేచి వ్రాసే అలవాటు ఆమెది. అలా వ్రాసినవాటికి తర్వాత సాపు వ్రాసుకుంటారు. భగవత్ప్రార్థన ఆమె నిత్యకృత్యం. వరలక్ష్మమ్మగారికి రవీంద్రుని రచనలు చాలా ఇష్టం కళాపూర్ణోదయం మరీ ఇష్టం. సాహిత్యం సభ్యంగా ఉండాలని ఆకాంక్ష-ఇప్పటి కథలు అసభ్యంగా ఉంటున్నాయని ఆవేదన''

''బహుముఖ ప్రజ్ఞతో శ్రీమతి కనుపర్తివారు చేసిన రచనలు తెలుగు సీమంతినుల హృదయసీమలకు కర్పూరనీరాజనలు. శారద లేఖల ద్వారా ఆధునిక నారీ జగత్తుకి వారు చేసిన సేవ, ఆధునిక ప్రపంచానికి వారిచ్చిన సందేశం, అనల్పమైనవి'' అంటూ తిరుమల రామచంద్రగారు వరలక్ష్మమ్మగారిని మరపురాని మనీషిగా చిత్రించారు.

అవనిగడ్డ గాంధీ క్షేత్ర వ్యవస్థాపక అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక విద్యాశాఖ ఆమాత్యులు అయిన శ్రీమండలి వెంకటకృష్ణరావుగారు ''ప్రఖ్యాత తెలుగు విదుషీమణి, వరలక్ష్మమ్మగారు చేసిన ప్రజోపయోగ కార్యక్రమాల్ని తెలిసికొని నేటి యువతరం ఉత్తేజితం కావాలి. స్త్రీహితైషిణీ మండలిని బాపట్లలో స్థాపించి నిర్వహించి స్త్రీ జనోద్ధరణకు వారు చేసిన సేవ కడు ప్రశంసనీయమైంది. త్యాగము, సేవా భావములతో కూడిన వీరి ఆదర్శమైన జీవితము నేటి యువతరంలో సేవా భావాన్నీ, సాహిత్యాభిలాషనీ తప్పక పురికొల్పగలదు'' అంటూ తనకు వరలక్ష్మమ్మపట్ల గల గౌరవాన్ని వెల్లడిచేశారు.

ప్రసిద్ధ రచయిత్రి, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం మాజీ ఉపాధ్యక్షులు అయిన శ్రీమతి నాయని కృష్ణకుమారిగారు ''వరలక్ష్మమ్మగారు గొప్ప సంఘ సంస్కరణాభిలాషిణి స్త్రీహితైషిణి, వక్త, రచయిత్రి, కావ్యకల్పనా చాతుర్యధురీణ, తన జీవనానుభవాలు, తన కన్నుల యెదుట జరిగిన ఎన్నెన్నో మరుపురాని సంఘటనలు, వీరి ప్రశస్తరచన శారద లేఖల్లో చోటుచేసుకున్నాయి ఈమె పద్యరచన కొద్దిగా చేసినా కమ్మెచ్చులు తీసినట్లు పద్యం నడవడం ఒక విశేషం. ఆమె లేఖా సాహిత్య ప్రక్రియకే ఒక శుభలేఖ సంఘసేవానిరతికి పట్టిన జయహారతి'' అని ప్రస్తుతించారు.

''లేఖా సాహిత్యం తెలుగులో వరలక్ష్మమ్మగారు చేపట్టడానికి ముందే ఉంది కాని దానికి ప్రాచుర్యం తీసుకువచ్చిన ఘనత ఆమెదే-నన్నయ్య భారతంతో తెలుగు పద్యరచనకు పునాది ఏర్పడినట్లు, ఈమె లేఖలతో తెలుగు సాహిత్యం తన విలువల్ని పెంచుకొంది'' అని 1977 డిశంబరు సంచికలో 'వనిత' అనే స్త్రీల మాసపత్రిక పొగిడింది.

ఆంధ్ర సారస్వత పరిషదధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి అయిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు ''సుమారు అర్థ శతాబ్దం క్రితం వెలుపడిన వరలక్ష్మమ్మగారి రచనలను విశేషించి శారద లేఖలను ఆసక్తితో చదివిన పాఠకులలో నేనొకడను. ఆ రోజులలో సాంఘిక సమస్యలను గూర్చి చక్కని తెలుగు శైలిలో వరలక్ష్మమ్మగారు వ్రాస్తూండేవారు. ఆ లేఖలను చదువుకొని మనస్సును వికాసము చేసుకొన్నవారిని ఎందరినో నేను చూశాను. ముఖ్యంగా చదువువచ్చిన స్త్రీలను అనేకులను ఉత్తేజితం గావించినది ఆమె లేఖిని వరలక్ష్మమ్మగారు అనేక సన్మానాలను గౌరవాలను పొందినారు. వారిని ఆం.ప్ర సాహిత్య అకాడమీ సన్మానించినది. ప్రపంచ తెలుగు మహాసభల

వేదిక, వారిని గౌరవించింది. ఈ సన్మాన గౌరవాలకు వారు సర్వవిధాలా అర్హులు. నాకు వరలక్ష్మమ్మగారితో పరిచయం కూడా ఉండినది'' అంటూ తనకు ఆమెపట్ల ఉన్న గౌరవాన్ని వెల్లడించారు.

కనుపర్తి వరలక్ష్మమ్మగారి శతజయంత్యుత్సవ సభలో ఆమెకి నివాళులర్పిస్తూ జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డ్రాక్టర్ సి. నారాయణరెడ్డి ''ఆమె సాహిత్యసేవ, సామాజిక సేవ చేసిన సవ్యసాచి ఆమె రచనల్లో భావం, భాషా ఒకదాన్ని ఒకటి ఒరిసికొని రసానంద ఝరిని పాఠకునికి సాక్షాత్కారింపజేస్తాయి'' అన్నారు.

తెలుగు అకాడమీ మాజీ డిప్యూటి డైరెక్టరైన డాక్టర్ బూదరాజు రాధాకృష్ణగారు ''తెలుగు సాహిత్యంలో ముఖ్యంగా లేఖారచనాప్రక్రియ స్మరణీయమైనంత కాలం, ఆమె కీర్తి, శేషంగా మిగులుతుంది. 'శారద లేఖలు' మహిళోద్యమానికే గాక ఆధునిక సాహిత్యానికి కూడా ఆదర్శవంతమైన మహారచన. నిరాడంబరజీవితం గడిపిన ఆ మహాసాధ్వి, తెలుగు పిల్లలకూ, తల్లులకూ, ఆదర్శం కావాలి, దేశాభిమాన ప్రకటన స్వార్థ ప్రయోజనాలకు గాక, ఆత్మోన్నతికే జాత్యున్నతికే దారి తీయాలని ఆమె ప్రవర్తనాచరణలద్వారా ప్రబోధించింది'' అని శ్లాఘించారు.

ప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి ''బాల్యం నుండి. జీవితాన్ని చాలించేవరకూ వెలిగిన వెలుగు, కనుపర్తి వరలక్ష్మమ్మగారు. లేఖావళిని చేపట్టి దాని నామె శిఖరాగ్రాలవరకూ ప్రాకనిచ్చినది. ఆమె తన శారద లేఖల్లో బూజుపట్టిన సనాతనాచారాల్నీ, మూఢనమ్మకాల్నీ తెగనాడారు'' అన్నారు.

1980 ప్రాంతంలో ఆంధ్రప్రదేశ్ స్త్రీ సంక్షేమ శాఖామాత్యులుగా వ్యవహరించిన రోడామిస్త్రీ ''వరలక్ష్మమ్మగారు అచంచల దేశభక్తురాలు. నిస్వార్థప్రజాసేవకురాలు. కవయిత్రి, మరియు మంచి వక్త'' అని శ్లాఘించారు.

ప్రముఖ సాహితీవేత్త, సంస్కృత కళాశాల మాజీ ప్రిన్సిపాల్ అయిన శ్రీ పేరాల భరత శర్మ కొన్ని వారాలపాటు ప్రముఖ దినపత్రికలో వరలక్ష్మమ్మగారి రచనా సామర్థ్యం పై వ్యాసాలు వ్రాసి ''ఆమె సాంప్రదాయానికీ అభ్యుదయానికీ సజీవ వారధి-అక్షరహారతి'' అన్నారు.

కళాప్రపూర్ణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ ''వరలక్ష్మమ్మగారితో నాకు నలుబది యేండ్ల పరిచయం ఉన్నది. నాకు ఎప్పటికి ఆమె అంటే పూజ్యభావమే! మహిళల్లో చైతన్యం కలిగించి, వారి ఉన్నతికీ, అభివృద్ధికీ దోహదం చేసే కార్యక్రమాల్ని ఆమె ఎప్పటికప్పుడు చేపడుతూ ఉండేవారు. ఆమె మంచి విదుషీమణి గొప్ప రచయిత్రి. స్త్రీలు పత్రికా రచన

ప్రారంభించడానికి, జంకుతూన్న రోజుల్లో ఆమె ఎన్నో రచనలు పత్రికల్లో ప్రచురించి, ఎంతో మందికి స్ఫూర్తిని కలిగించారు. ఉత్తమ గాంధేయవాది ఆమె. ఎల్లప్పుడూ ఖద్దరే ధరించేవారు. కాశీపోసి చీరకట్టి నొసట ఎఱ్ఱని కుంకుమ బొట్టు పెట్టుకొని ఆమె నడిచివస్తూంటే, ఋషులకాలంనాటి పెద్దముత్తైదువలు జ్ఞాపకం వచ్చేవారు'' అంటూ వరలక్ష్మమ్మగారిని ఆత్మీయంగా స్మరించుకొన్నారు.

''సమాజం కల్పించిన సంకెళ్ళనుంచి మహిళల్ని విముక్తుల్ని చేసి వారి జీవితాల్లో చైతన్యాన్నీ, ఉత్సాహాన్నీ కలిగించడంకోసం కలం పట్టిన సాహిత్యమూర్తి శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ. తన భావాల్ని సూటిగానూ బలంగానూ చెప్పడానికి అనువుగా ఉంటుందని ఆమె వచనాన్ని ఎన్నుకొన్నారు. వచన రచనా సామర్థ్యానికీ తెలుగు నుడికారపు సొంపులకీ, అభ్యుదయ మార్గంలో సాగిన ఆమె మనోభావాలకీ, ఆమె రచనలు తళుకుటద్దాలు''అంటూ నివాళులర్పించారు ప్రముఖ కథానవలా రచయిత శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తి.

''రసవత్తరమైన భావాలతో రచనలు చేసే వరలక్ష్మమ్మ ఖద్దరు చీరలో ఉత్తమ గృహిణీ రూపంలో భాషా సేవచేస్తూ, నాకంటికి ఆంధ్ర సరస్వతిలా కనిపించేవారు'' అని శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు శ్లాఘించారు.

''చిత్తమును, విత్తమును, జీవితమును, మహత్కార్యములకై మీదుకట్టిన మహనీయులు అజరామరులు. అట్టి మహనీయులైన వ్యక్తులలో కనుపర్తి వారు మాన్యులు'' అని శ్రీమతి కొండా పార్వతీదేవి ప్రస్తుతించారు.

ప్రసిద్ధ కథారచయిత్రి, నవలారచయిత్రి అయిన శ్రీమతి పవని నిర్మల ప్రభావతి ''శ్రీమతి వరలక్ష్మమ్మ గురించి వ్రాయడం అంటే గత అర్ధశతాబ్ది సాంఘిక ఆర్థిక రాజకీయ, సాహిత్య, కళారంగాలగురించి వ్రాయడమే అవుతుంది. ఆమె కలం, వాగ్ధాటి, ఆనాటి స్త్రీలలోనూ సమాజంలోనూ ఎంతో మార్పుని తీసుకువచ్చాయి. మహిళా మండలులు అంటే, నాగరికతని ప్రదర్శించుకోడానికీ, హోదాలు అలవరచుకోడానికీ కాదనీ, తోటి స్త్రీలలో విద్యా విజ్ఞాన వికాసములు కలిగించే విద్యాలయాలనీ వరలక్ష్మమ్మగారు తన స్త్రీహితైషిణీ మండలి ద్వారా నిరూపించారు రచయిత్రిగా, గృహిణిగా ఆమె రెండు బాధ్యతల్నీ అతి సమర్థంగా నిర్వహించారు ప్రాచీన హిందూ సంస్కృతి పునరుద్ధరణకోసం ఆమె ఎన్నో రచనలు చేశారు'' అంటూ నతులర్పించారు.

ప్రముఖ సంఘ సేవకులు, బహుగ్రంథకర్త అయిన మల్లాది సుబ్బమ్మగారు ''వరలక్ష్మమ్మగారు నాకు గురుతుల్యులు'' అంటూ వందనం చేశారు ''స్త్రీలకొక స్థాయీ స్థానం కావాలనీ, విద్యావిజ్ఞానాలద్వారా వారి వ్యక్తిత్వం వికసించాలనీ వరలక్ష్మమ్మగారు

ఎప్పుడూ అనేవారు ఆ లక్ష్యాన్ని చేరుకోవడంకోసం ఆమె అహర్నిశలూ కృషిచేశారు. నిరాడంబరతకు వరలక్ష్మమ్మగారు మారు పేరు. స్వయం కృషితో మనిషి మనీషి కాగలరనడానికి ఆమె జీవితమొక నిదర్శనం. వారెప్పుడూ ఏ పదవీ కోరలేదు. ఎవరినీ ఆశ్రయించలేదు. అనేకమందిని అనేకరంగాల్లో పైకి తీసుకువచ్చే గురుత్వాకర్షణ శక్తి ఆమెలో ఉంది. తన శిష్యులు తనని మించి ఎదగాలంటూ ఉండేవారు. వారి ఆదేశాలూ సందేశాలూ మనకి శిరోధార్యాలు. ఈ శతాబ్ది ద్వితీయార్థం మహిళా చైతన్యంతో వెల్లివిరిసిందంటే, ఆమె రచనలే కారణం'' అని ప్రస్తుతించారు.

''చిన్నప్పుడు చిలకలా పరికిణీతో కిలాకిలా నవ్వుతూ తిరగడం నాకు తెలుసు. తర్వాత ఖరీదుగల ఝరీ చీరలో ఎంతో హుందాగా మసలడం చూశాను. పిమ్మట తెల్లని ఖద్దరు చీర కాశీపోసికట్టుకొని యోగినిలా నడయాడ్డం చూశాను. ఏ వేషంలో ఉన్నా ఆమె ఔన్నత్యం ఔన్నత్యమే! ఆమె చేసిన సేవా కార్యక్రమాలూ, రచించిన గ్రంథాలూ ఆమెని చిరంజీవిని చేశాయి'' అంటూ శ్రీమతి గోగులపాటి సత్యభామమ్మ తన మధురమైన జ్ఞాపకాల్ని మననం చేసుకొన్నారు.

ఈ గ్రంథ రచయిత్రి అయిన శ్రీమతి పోలాప్రగడ రాజ్యలక్ష్మిని నేను, వరలక్ష్మమ్మ స్మారక సంచికలో ఆమెను స్మరిస్తూ ''నాకు ఆమెతో 12 సంవత్సరాల పరిచయం ఉంది. అది కేవలం పరిచయం కాదు. చందనంలా, గుబాళించే ఆత్మీయత. అమ్మాయీ అంటూ ఎంతో ఆత్మీయంగా పిలిచేవారు. ఆమె మంచి మనస్సుకి అద్దంపట్టినట్లుండేవి ఆమె మాటలూ, చెప్పే విషయాలూను. వచన రచనలద్వారా వనితల్లో చైతన్యం తీసుకువచ్చిన గొప్ప రచయిత్రి ఆమె. నేటి స్త్రీలకి వరలక్ష్మమ్మగారు మహోజ్వలమైన మార్గం చూపించిన మణిదీపం'' అని రాశాను

# జీవన రేఖలు

| | | |
|---|---|---|
| 6-10-1896 | - | జననం-గుంటూరు జిల్లా 'బాపట్ల'లో |
| 1909 | - | కనుపర్తి హనుమంతరావుగారితో వివాహం |
| 1919 | - | సౌదామిని కలం పేరుతో తొలి రచన |
| 1921 | - | మహాత్మగాంధీ దర్శనం |
| 1922 | - | ఆంధ్రపత్రికలో 'లీలావతి' అనే కలం పేరుతో 'మా చెట్టు నీడ ముచ్చట్లు' ప్రారంభం |
| 1928 | - | గృహలక్ష్మి పత్రికలో 'శారద లేఖలు' ప్రచురణ ప్రారంభం |
| 1929 | - | మహిళాసభ అధ్యక్షత-బెజవాడలో |
| 1930 | - | 'స్త్రీ అబల కాదు' అనే వ్యాసానికి గృహలక్ష్మి స్వర్ణ పతక బహూకరణ |
| 1931 | - | బాపట్లలో 'స్త్రీహితైషిణీ మండలి' స్థాపన |
| 1933 | - | రాష్ట్ర మహిళా సభకి అధ్యక్షత-గుంటూరులో |
| 11-3-1934 | - | గృహలక్ష్మి స్వర్ణకంకణ బహుకరణ-నెల్లూరులో-గృహలక్ష్మి తరపున శారద లేఖలు ప్రథమ సంపుటి ప్రచురణ |
| 1942 | - | స్త్రీహితైషిణీ మండలి శాశ్వత భవన నిర్మాణం |
| 1942 | - | ఆంధ్ర మహిళా సభ అధ్యక్షత |
| 1949-52 | - | గుంటూరు జిల్లా బోర్డు సభ్యత్వం |
| 1-10-1952 | - | మహిళా మండలివారి సన్మానం-బాపట్లలో |
| 1952 | - | ఆంధ్ర రాష్ట్రోద్యమ భాగంగా మహిళా ప్రదర్శన సారధ్యం |
| 5-4-1953 | - | బాపట్ల పురప్రముఖులచే సన్మానం |
| 8-10-1954 | - | భర్తృవియోగం |
| 1959 | - | యువతీ సంక్షిప్త విద్యాలయ స్థాపన-బాపట్లలో |
| 1960 | - | హైదరాబాదులో ఆంధ్ర యువతీ మండలి రజితోత్సవ సన్మానం |

1962 మే - దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ పరిచయం

1962 మే - మద్రాసు ఆంధ్ర మహిళాసభ రజితోత్సవ సన్మానం

5-7-1965 - 'హనుమంతరాయ బాల విద్యావిహార్' ప్రారంభం-బాపట్లలో

1965 - అఖిల భారత రచయిత్రుల సభలో అభిభాషణ

జనవరి 1967 - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి ఉత్తమ రచయిత్రి పురస్కారం

1967 - శారద లేఖలు ద్వితీయ సంపుటి ప్రచురణ

అక్టోబర్ 1967 సప్తతి మహోత్సవ సన్మాన సభ-'కవితాప్రవీణ' బిరుదు ప్రదానం-గుడివాడలో

మే 1968 - ఆలిండియా తెలుగు రచయితల మహాసభలో సన్మానం-హైదరాబాదులో

ఉగాది 1975 - హైదరాబాద్ లాల్ బహాదూర్ స్టేడియంలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల్లో స్వర్ణఫలక, తామ్రపత్ర బహుకృతి.

13-8-1978 - కన్నుమూత

★ ★ ★

23-3-1980 - మాన్య శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతలో బాపట్ల స్త్రీహితైషిణీ మండలిలో ఇల్లిందల సరస్వతీదేవిచే వరలక్ష్మమ్మగారి స్మారక సంచిక ఆవిష్కరణ

1996 - ఆచార్య సి. నారాయణరెడ్డి, డాక్టర్ కృష్ణకుమారి అధ్వరంలో కనుపర్తి వరలక్ష్మమ్మ శత జయంతి ఉత్సవాలు-శత జయంతి సంచిక ఆవిష్కరణ-హైదరాబాదులో

# ఉపయుక్త గ్రంథ సూచి


1. శారద లేఖలు (ప్రథమ సంపుటి)
2. శారద లేఖలు (ద్వితీయ సంపుటి)
3. వసుమతి
4. నవకథావిపంచి
5. బాలనీతి కథావళి
6. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ స్మారక సంచిక (23-3-1980)
7. జాతిరత్నాలు (9వ తరగతి తెలుగు ఉపవాచకం)
8. కనుపర్తి వరలక్ష్మమ్మ (1896-1996)
9. భారతి సంచికలు-1925 నుండి 1945 వరకు.